అఖిలాండ
ఆంధ్ర మహిళా దివ్యజ్యోతి
దీపావళికి
సరిక్రొత్త రంగులతో వెదజల్లే మణిమయ జ్యోతి '' వాణి ''
మైలాపూర్
వాణి సిల్క్సు వారి

దీపావళి
సరిక్రొత్త రంగులు
అను – అర్చన
సరికొత్త డిజైనులు ప్రతిభ – సుప్రజ
అన్ని శుభ సమయములందు ధరించి ఆనందించండి
వాణి సిల్క్స్
(ఏర్ కండిషన్డ్ షోరూమ్)
132, రాయపేట హైరోడ్
మైలాపూర్, మద్రాసు–4
ఫోన్ : 76359

SELVAM




all waiting for you at

# Sugan

**the new air-conditioned exclusive Binny Showroom**

JAIN BUILDINGS
PANAGAL PARK, T. NAGAR, MADRAS-17
PHONE: 441479

Khakhi and Casement in assorted shades for uniforms with a fabulous spread of Binny fabrics - way - out denims, colourful cottons, exotic silks, sheer chiffons and georgettes; trendy polyester blends and 'Terene'/wool Carnaby; cosy Cotswol and Binola.

**Come, let your fancy loose in SUGAN**
*Open from 9 A.M. to 1 P.M. & 3 P.M. to 8 P.M.*
MONDAYS THROUGH SATURDAYS

**BINNY**




# వనిత

స్త్రీ జన పక్ష పత్రిక

సంపుటి : 3 సంచిక : 9

నవంబరు ఒకటి : 1977

విడి ప్రతి : ఒక రూపాయి

సం॥ర చందా : ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 1.15

మలేసియా : 65 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


సెప్టెంబరు 15వ తారీఖు వనితలో తెరాలగారి 'వాటకందార్లుగా వనితల బాధ్యతలు' వ్యాసం చదివాను. చాలా బాగుంది. వ్యాపారస్థుల అన్యాయాలను, అవినీతిని, అధిక ధరల సమస్యను వనితలు సులభంగా పరిష్కరించే మార్గం చాలా చక్కగా తెలిపారు. అయితే అది అందరూ చాలా బాగుంది అంటారు; అన్నారు. మళ్ళీ రెండు రోజుల తరువాత అడిగితే 'ఎందుకండీ ! అందరికీ శ్రమ, ఏదో నెల మొత్తంమీద 2 రు. 3 రు. తేడా వస్తుంది. అంతేకదా వద్దులెండి' అన్నారు. '5 కుటుంబాలకు మొత్తం 15 రు. తగ్గుతుంది కదండీ' అంటే 'ఆ ! ఎందుకులెద్దురు' అని తప్పించుకున్నారు. ఇరుగుపొరుగుల సహకారం లేకపోతే యిలాంటివి ఎలా సాధ్యమవుతాయి? కానీ మీరు మాత్రం యిలాంటి ఉపయోగకరమయిన వ్యాసాలనే ప్రచురించాలని కోరుతున్నాము.

—ఎ. సావిత్రి, శ్రీకాకుళం

అక్టోబరు 1వ తేదీ 'వనిత'లో ముఖ్యంగా నన్నాకర్షించినది—'మహిళా మండలులు-వాటి ఆవశ్యకత' అన్న అంశంపై వివిధ మండలుల ప్రధాన కార్యకర్తల గోష్ఠి కార్యక్రమం. ఆకార్యకర్తలందరూ వారివారి సంస్థలు స్త్రీ జన అభివృద్ధి కోసం వివిధ రంగాలలో సాధించిన కృషిని గూర్చి తెలియజెప్పడమే కాకుండా, వాటి నిర్వహణలోని కష్ట నష్టాల గురించీ, సాధక బాధకాల గురించీ తెలియజెయ్యడం ముదావహం. ఆ విషయాలు కొత్తగా మహిళాసంస్థలు స్థాపించబోయే వారికి ఎంతగానో ఉపయోగపడతాయనడంలో సందేహం లేదు.

—శ్రీమతి యు. వి. ఎస్. భాస్కరం, రాజమండ్రి

మీరు క్రొత్తగా ప్రారంభించిన "నేర్చుకున్న గుణపాఠం" చాలా బాగుంది. దీనివలన ఇక మీదట స్త్రీలు "అలాంటి" విషయాలలో మోసపోకుండా ఇది ఉపకరిస్తుంది. "తరం మారింది" కథ చాలా బావుంది. నిజంగా రవిచంద్రలాంటి వాళ్ళు ఈ సమాజానికి దిష్టి పిడతల్లాంటి వాళ్ళే. వినయమణిలాంటి వారివలననే ఈ సమాజం మణిలా ప్రకాశింప గల్గుతుంది. ఎంతో ఉత్సాహంగా, హాస్యంగా మొదలయి, చక్కగా జరుగుతున్న "కాంతికిరణాలు" సీరియల్ ముగింపు చాలా చప్పగా ఉంది. 'ఏదో ముగించాలి' అన్నట్లుగా ముగించినట్లుంది. 'ముగింపు' మాత్రం చాలా నిరాశ కలిగించింది.

—యస్. వసుధ, మార్కాపూర్

'కాంతికిరణాలు' సీరియల్ మొదటి సన్నివేశం నుంచి ముగింపు వరకూ కుతూహలంగా, తరువాత సంఘటనల కోసం ఆసక్తిగా ఎదురు చూచేటట్లు, పాఠకులలో ఉత్కంఠ రేకెత్తించే విధంగా రచించారు. ఒక్క మాటలో చెప్పాలంటే మొత్తం నవలంతా ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ సినిమాలా సాగింది. సృజన్‌బాబు ధీరోదాత్త నాయకుని వలె, స్నేహానికి ప్రాణమిస్తూనే, పొరపాటు జరిగినందుకు స్వరూప జీవితాన్ని చక్కదిద్దటానికి చేసిన ప్రయత్నాలు, తానే ఆమెను స్వీకరించటానికి నిశ్చయించి, ఆమె జీవితాన్ని సుఖమయం చేయటానికి దారి చూపిన విధానం మా మనసులో మరువని ముద్ర వేసింది. అలాగే నవల ముగింపులో కూడా రచయిత్రి సురేంద్ర మనస్తత్వంలోని మార్పుని చాలా సహజంగా చెప్పగలిగారు. ఈ నవలలోని కథాంశం, అందరి పాత్రల స్వరూప స్వభావాలను తక్కువ సంఘటనలతో, సహజమైన మాటలతో సూటిగా తన రచనా శైలి ద్వారా పాఠకుల మనసులలో హత్తుకుని వుండే విధంగా రచించిన రమాదేవి గారికి నా అభినందనలు.

—ఏలేశ్వరపు రాజరాజేశ్వరి, మంగళగిరి

'కాంతికిరణాలు' ముగింపు చాలా బావున్నది. పాఠక లోకానికి సంతృప్తిని కలిగించినది. రచయిత్రి సన్నివేశాల మలుపులను చాలా చక్కగా రచించారు. ఏ వ్యక్తి ద్వారా జీవితం మోడుబారి పోయినదో ఆ వ్యక్తి మళ్ళీ ఆ జీవితంలో వసంతాన్ని పొందేలా చేయడం కథలో కొత్తదనం. సృజన్‌బాబులాటి యువకులు, వారి మిత్రుల్లాంటి మిత్ర బృందం నేటి సమాజానికి యెంతో అవసరం. అటువంటి మంచి



ఈ సంచిక 14వ పేజీలోని కథ – 'సగంలో ఆగిన ఆల్బమ్' రచయిత్రి శ్రీమతి బి. స్వర్ణాంబ–తిరుపతిలోని పద్మావతీ కళాశాలలో తెలుగు ఉపన్యాసకురాలిగా వుంటున్నారు. యమ్. ఫిల్ డిగ్రీకోసం గురజాడ అప్పారావుగారి కథల మీద శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేస్తున్నారు. పదహారు సంవత్సరాలుగా ఆమె వివిధ పత్రికల్లో, గేయాలు, కథలు, నాటికలు, వ్యాసాలూ రాస్తున్నారు. నృత్యనాటికలు, బుర్ర కథలూ కూడా రాశారు. కవితాగోష్ఠులలోనూ, కథకుల సమ్మేళనాలలోనూ పాల్గొన్నారు. 'వనిత'లో ఇదివరకే ఆమె రాసిన రెండు కథలూ, గేయం వచ్చాయి.

మనసులున్న మనుష్యులవల్లనే కాంతికిరణాలు వెదజల్లుతాయి.

—తాడి శివలక్ష్మి, ఏలూరు

అక్టోబరు 1 సంచికలో 'అందమైన ప్రాకులు' రూపొందించే విధానం, విశదంగా, చిత్రాలతో సహా విపులీకరించిన మంగళాకుందూర్‌గారు ఎంతైనా అభినందనీయులు. ఈ శీర్షిక మాతృమూర్తులైన వనితలకు ఎంతో ఆనందం కలిగించేదిగా వున్నది. ఎందుకంటే ఇదే విధంగా, ఎంబ్రాయిడరీ చేసిన ప్రాక్‌ను రెండు సంవత్సరాల పాపకు తీసుకోవాలంటే రెడీమేడ్ షాపులో 50 రూ॥ ఖర్చు అవుతున్నది. కాబట్టి ఈ శీర్షిక ద్వారా తెలుసుకుని ఎంతో కొంత తక్కువ ఖర్చుతో, ఓపిగ్గా ప్రాక్‌ను రూపొందించి, పాపకు ధరింపజేసిన సమయంలో ఆ తల్లి పొందే ఆనందాన్ని, తృప్తినీ ఎలా నిర్వచించగలం? ఖరీదైన జీవితాలకుపయోగించే పరికరాల విపులీకరణకన్నా, ఇలా జన సామాన్యానికందుబాటులో వుండే విషయాలను ఎక్కువగా ప్రచురిస్తే బాగుంటుంది. —డి. శివకుమారి, కూచిపూడి

మహిళా లోకాన్ని విస్తృతంగా ఆకట్టుకున్న వనిత పక్ష పత్రిక రాను రాను మగవారిని కూడా ఆకర్షించే రీతిలో ప్రచురితమవుతున్నందుకు సంతోషం. సమాజంలో మహిళా సాంస్కృతిక వికాసానికి, పురుషులలో చైతన్యం రావటానికి యిటువంటి పత్రికల అవశ్యకత ఎంతగానో ఉంది. అక్టోబర్ 1, సంచికలోని "మహిళా మండలులు-వాటి అవశ్యకత-నిర్వహణలో సాధక బాధకాలు" చర్చ, మొత్తం పత్రికకు ఆభరణంగా అలరారింది. కాని ఈ చర్చలో గ్రామీణ మహిళల వికాసానికి మహిళా మండలుల అవశ్యకత, ప్రాధాన్యం చర్చకు రాలేదు. నిజానికి మహిళా మండలుల ఆవశ్యకత పట్టణాలలో కంటె గ్రామాలలోనే అధికం. పట్టణాలలోని మహిళా మండలులు, గ్రామీణ స్త్రీల నాగరికతా వికాసానికి, వారి అభ్యుదయానికి కృషి చేయాలి. అప్పుడే మహిళా మండలుల ఆదర్శానికి పరిపూర్ణత లభిస్తుంది. —జి. కల్యాణి, శ్రీకాకుళం

'వయసెంత?' (28వ పేజీ) కథ రాసిన శ్రీమతి కె. ఇందిర-'అనుగ్రహింపబడని మూడు వరాలు' కథతో 'వనిత' పాఠకులకు పరిచితురాలు. అది ఆమె తొలి కథ, ఇది మూడవకథ. రెండవ కథ 'మహిళ'లో వచ్చింది. శ్రీమతి ఇందిర స్వస్థలం తెనాలి. బి. ఎస్ సి వరకూ చదివారు. భర్త ఉద్యోగరీత్యా ప్రస్తుతం మదురై (కోయంబత్తూరు)లో ఆమె వుంటున్నారు.



డా॥ ఎ. విజయలక్ష్మిగారి 'ముత్యాల గర్భిణి' ఎంతో ఆసక్తిదాయకంగా వుంది. ఇప్పటిదాకా వచ్చిన కథలన్నింటిలోనూ స్త్రీల గర్భ వ్యాధులకు సంబంధించిన యీ కథ నిజంగా ఒక వెరైటీ. ఈ మధ్య వచ్చిన కథలన్నీ వంటింటికీ, వరకట్నాలకీ, ప్రేమకీ, పెళ్ళిళ్ళకీ, చీరలకీ మాత్రమే పరిమితమై ఉన్నాయి. అలాంటివి చదువుతోంటే (ఉదా-'నాకు మీ ప్రేమే కావాలి') మన రచయిత్రులకు కథలకు అంశాలే దొరకవా? లేక ఎంతసేపూ కూపస్థమండూకంలా తామున్నదే ప్రపంచమనుకుని బయటి ప్రపంచంలో జరిగే వింతలనీ, విశేషాలనీ, ఇంకా ఎన్నో సమస్యలనీ చూడలేక పోతున్నారా అన్పించింది. చక్కటి శైలిలో ఎంతో సహజంగా 'ముత్యాల గర్భిణి' వ్యాధి గురించి శాంతకు డాక్టర్ వివరించిన అంశాలు చదువుతుంటే ఎప్పుడూ యీ జబ్బు గురించి వినని నాకు గుండె జలదరించింది. వరుసగా ముగ్గురు ఆడపిల్లల్ని కని, ఇంకా ఒక మగపిల్ల వాడు పుట్టాడని, అందుకు ప్రయత్నించి చివరికి ప్రాణాల మీదకి తెచ్చుకునే భాస్కర్‌రావ్, వసంత లాంటి జంటలకు ఈ కథ గొప్ప కనువిప్పు.

—కె. సూర్యప్రభ, హైదరాబాద్

నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతున్న ఈ గడ్డు రోజుల్లో వాడుకదార్లగా వనితల బాధ్యతలను గుర్తుచేసిన, 'తెరాల' గారికి నా అభినందనలు. ఈ వ్యాసం చదివిన తరువాతనయినా ప్రతి వాడలోను అవకాశమున్న వనితలు, ఉత్సాహంలో ముందుకు వచ్చి వాడుకదార్ల సమష్టి సంఘాలను స్థాపించి, వాటి సక్రమ నిర్వహణకై కృషి సలుపగలరని ఆశిస్తాను. స్థాపించిన అనంతరం సంఘాల నిర్వహణలో తమ తమ అనుభవాలను, సభ్యులకు అందిన ప్రయోజనాలను, 'వనిత' ద్వారా ప్రచురించినయెడల, మరి కొంతమందిలో చైతన్యం కలిగి, మరిన్ని సంఘాలను నెలకొల్పడానికి ప్రోత్సాహం కల్పించినవారు కాగలరు.

—కె. లక్ష్మీకాంతం, బిలాస్‌పూర్

వచ్చే సంచికలో

**ముఖచిత్రం**

బాలల దిన సందర్భంగా

"పాపాయి"

**మధ్య పేజీలలో వర్ణచిత్రం**

"బాలలు"

**రెండు కథలు:**

అంచనా

(బద్దెపూడి సుధారాణి)

అత్తలంతా ఇంతే!

(జె. భారతీ భరత్)

**ప్రత్యేక గోష్ఠి:**

శ్రీమతి రతీ ఝా

(మద్రాసు కలెక్టర్)

'అభిప్రాయాలు' శీర్షికలో పచురింపబడే ప్రతి లేఖకూ ఐదు రూపాయలు పారితోషికంగా పంపుతాము.

# ఒక విదేశీయ వనిత దృష్టిలో దీపావళి

మన దేశంలో పుట్టి, ఇక్కడే పెరిగిన వనితలు పండుగలూ పబ్బాలూ జరుపుకోవడానికి ఉత్సాహం చూపడంలో ఆశ్చర్యం లేదు. మన దేశస్థులను పెళ్ళాడిన వనితలు మన దేశ ఆచారవ్యవహారాల పట్ల ఆసక్తి చూపి, మన పండుగలను శ్రద్ధగా జరుపుకోవడం ఆశ్చర్యంగానే కనిపిస్తుంది.

స్వీడెన్ దేశానికి చెందిన స్టీనా–భారతీయుడైన శ్రీ టి. టి. వాసు (భారతదేశపు మాజీ ఆర్థిక మంత్రి కీ॥ శే॥ టి. టి. కృష్ణమాచారి కుమారుడు)ను పెళ్ళాడి శ్రీమతి స్టీనా వాసు అయ్యారు. అప్పటి నుంచీ ఆ దంపతులు ఇటు హిందూ సంప్రదాయ సిద్ధమైన పండుగలతో బాటు, స్వీడెన్ దేశపు పండుగలు కూడా జరుపుకుంటున్నారు.

"1963 అక్టోబర్‌లో మా వివాహం జరిగింది. మా పెళ్ళికాగానే మొట్ట మొదట వచ్చిన పండుగ దీపావళి. మా తొలి దీపావళి రోజున తెల్లవారు జామున ఐదుగంటలకల్లా నిద్రలేచి మంగళ స్నానం చేసి మా బంధువు ఇంటికి వెళ్ళాము. కొత్త బట్టలు ధరించి సంబరంగా టపాకాయలు కాల్చాను. తక్కిన పండుగలకన్నా నాకు దీపావళి అంటే చాలా ఇష్టం. ప్రమిదలలో నూనె నింపి, వత్తులు వేసి వాటిని వెలిగించడం అంటే నాకు ఎంతో ఇష్టం. నా తొలి దీపావళి – మరపురాని రోజు," అన్నారు శ్రీమతి స్టీనా.

"మొదట నాకు దీపావళి పండుగ ప్రాధాన్యం గురించి తెలియదు. ఆ తర్వాత దీపావళి ప్రాధాన్యం గురించి తెలుసుకున్నాను," అంటారు ఆమె.

స్టీనా–ఢిల్లీలోని స్వీడెన్ దేశ దౌత్య కార్యాలయంలో పని చేస్తూ ఉండేవారు. "అప్పట్లో స్నేహితులొకరి ద్వారా నాకు శ్రీ వాసుతో పరిచయం అయింది. ఆ పరిచయం స్నేహంగా రూపొంది పెళ్ళిదాకా వచ్చింది. స్వీడెన్‌లో రిజిస్టర్ పెళ్ళిగా మా స్నేహం గట్టిపడింది" అని తమ వివాహం గురించి చెప్పారు ఆమె. స్టీనా వాసు దంపతులకు ముగ్గురు పిల్లలు.

వాసు కుటుంబంవారు దీపావళితోబాటు క్రిస్మస్, ఈస్టర్ వంటి పండుగలను కూడా భేదం లేకుండా జరుపుకుంటారు. తాము జరుపుకునే స్వీడెన్ దేశపు పండుగల గురించి చెబుతూ "స్వీడెన్‌లో 'మిడ్ సమ్మర్' అన్నది చాలా ప్రాచుర్యంలో ఉన్న పండుగ. ప్రతి సంవత్సరమూ జూన్ 24 తేదీ ప్రాంతాలలో వచ్చే ఈ పండుగ–స్వీడెన్‌లో చాలా 'పెద్ద' రోజు. ఇలా పెద్ద రోజు అనడంలో మూఢ విశ్వాసాలు ఏవీ లేవు. ఆ రోజున స్వీడెన్‌లో చీకటిపడదు. సాయంకాలం ఆరు గంటలు దాటాక కూడా–సూర్యుడు అస్తమించక అలాగే ఉండిపోతాడు. ఎందుకో తెలుసా? స్వీడెన్ ఉత్తరధ్రువానికి సమీపంగా ఉండడం వల్ల సూర్యుడు క్షితిజాన్ని సమీపించి మళ్ళీ ఉదయించడం ప్రారంభిస్తాడు. అందువల్ల చీకటిపడదు. ఆ రోజు ఒక పెద్ద గడను నాటి దాన్ని పండ్లతోనూ, ఆకులతోనూ అలంకరిస్తాము. ఆ గడను 'మే పోల్' అంటాము. ఆ రోజంతా నాట్యం ఆడడం, పాటలు పాడడం వంటి వినోద కార్యక్రమాలు, విందులు సాగుతాయి," అన్నారు ఆమె.

స్వీడెన్‌లో కూడా ఒక 'దీపాల పండుగ' జరుపుకుంటారు. అయితే ఆ పండుగ–స్వీడెన్‌కు తొలిసారిగా 'వెలుగు'ను తెచ్చిన ఒక పుణ్యమూర్తి జ్ఞాపకార్థం జరుపుకుంటారు. "'లూసియా' అనే ఆ పండుగ డిసెంబర్ 13 నాడు జరుపుకుంటాము. అందమైన యువతి ఒకామె నెత్తిన ఒక వలయం అమర్చి, దాని చుట్టూ కొవ్వొత్తులు వెలిగించి ఉంచుతాము. ఆ యువతి స్వచ్ఛమైన తెల్లని దుస్తులు ధరిస్తుంది. ఆమెలాగా దుస్తులు ధరించిన చిన్న పిల్లలు ఆమె చుట్టూ నిలబడి పాటలు పాడుతూ ఆడుతారు," అని ఆ పండుగ గురించి తెలియజేశారు శ్రీ వాసు.

"ఆ రోజున మద్రాసులో ఉన్న మా స్వీడెన్ స్నేహితులను పిలిచి వారికి కేక్స్, కాఫీ యిచ్చి సత్కరిస్తాము," అన్నారు ఆయన.

"జాతి మత భేదాలకూ, దేశాలకూ అతీతమై ఏ దేశంవారైనా ఒక్కటే అనే దృష్టితో ప్రవర్తిస్తే బతుకే పండుగ కాదా?" అని అడిగే వారికి–తమ అభిప్రాయాన్ని బలపరచుకోవడానికి స్టీనా, వాసుల వంటి దంపతులు మంచి ఉదాహరణలుగా ఉండగలరు।

—కస్తూరి రాధాకృష్ణన్



# ప్రపంచం

'ప్రపంచం'లో ఒక దేశానికి ఇంకొక దేశానికి మధ్య ఏదో విషయంలో సామ్యం కనిపిస్తూనే వుంటుంది. ఆస్ట్రేలియా విషయమే తీసుకుందాం.

ఆస్ట్రేలియాను 'ది లాండ్ ఆఫ్ కంగారు' అని అంటారు. ప్రపంచంలో పెద్ద ద్వీపం ఆస్ట్రేలియా. జనాభా ఒక కోటి ముప్ఫయి లక్షలు. ఇందులో ఆదిమ జాతివాసులు కూడా చెప్పుకోదగ్గ సంఖ్యలో వున్నారు.

ఆస్ట్రేలియా ఇప్పుడు ఎన్నికలకు సిద్ధమవుతోంది. అక్కడ ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నమయిపోయి, అవినీతి పెరిగిపోయిందనీ, 1968లో ప్రధానమంత్రి పదవి స్వీకరించిన ఫ్రేజర్ ప్రజలకు ఇచ్చిన వాగ్దానాలు అలాగే వుండిపోయాయనీ, అరచేతిలో స్వర్గం చూపించగల నిపుణులు ఆస్ట్రేలియాలోనూ వున్నారని ఫ్రేజర్ నిరూపించాడనీ అంటారు. లేబర్ పార్టీ, ఫ్రేజర్ పక్షమూ ఇక ఎన్నికలకు సిద్ధమవుతాయి. నిరుద్యోగ సమస్యను పరిష్కరించలేక, ద్రవ్యోల్బణాన్ని అరికట్టలేక ఫ్రేజర్ ఎన్నికలలో ఓడిపోతే అధికారంలోకి వచ్చే లేబర్ పార్టీ ఎంతవరకూ విజయం సాధిస్తుందో ఊహించడం కష్టం.

## వార్తలలో మలేసియా వనితలు

ముస్లిం వనితలు సాధారణంగా 'పర్దా' ధరిస్తూ వుంటారు. భర్తకు, దగ్గరి బంధువులకు తప్ప ముస్లిం వనితలు తమ ముఖాలు చూపించరు. మలేషియా ముస్లిం వనితలూ ఈ సంప్రదాయాన్ని పాటిస్తున్నారు. అయితే మలేసియా ముస్లిం వనితలు కొంత ముందడుగువేసి 'మినీ పర్దా'లు ధరించి సంచలనం సృష్టిస్తున్నారు. సంపదను సేకరించడం, ఆడంబర జీవనం గడపడం మలేసియా సమాజం అంగీకరించదు. ఈ 'పాఠాలే' విశ్వవిద్యాలయాల్లో పాఠ్యభాగాలయిపోయేసరికి అక్కడి ఆధునిక వనితల్లో గొప్ప 'మార్పు' వచ్చి 'పర్దా'ల నుంచి 'మినీ పర్దా'లకేసి పురోగమిస్తున్నారు.

మలేసియాకు స్వాతంత్ర్యం వచ్చి రెండు దశాబ్దాలు పూర్తయింది. దాతుక్ హుసేన్ నాయకత్వంలో, వనితల సంగతి అలా వుండగా సుస్థిరమయిన ప్రభుత్వం దేశాన్ని అన్నివిధాలా ముందుకు నడిపిస్తోంది. 'సన్స్ ఆఫ్ ది సాయిల్' సిద్ధాంతానికి 'తిలోదకాలు' ఇచ్చిన కీర్తి హుసేన్‌కి దక్కుతుంది. దేశ ఆర్థిక వ్యవస్థ మెరుగుపరచడానికి హుసేన్ జరుపుతోన్న కృషి విజయవంతం కాగలదని అందరూ ఆశిస్తున్నారు.

## భారత - అమెరికా సంబంధాలు

ప్రపంచంలో ప్రజాస్వామ్య దేశాలలో పెద్దదిగా భారతదేశాన్ని చెప్పుకుంటే రెండవ స్థానం అమెరికాది. అబ్రహం లింకన్ ప్రజాస్వామ్యం అంటే ఏమిటో నిర్వచించాడు. ఆ పునాదులమీదే నిలబడిన భారత, అమెరికా దేశాలు ఎన్ని అభిప్రాయ భేదాలు ఏర్పడినా తమ అనుబంధాన్ని మటుకు కాపాడుకుంటున్నాయి. అయితే గత ఐదు సంవత్సరాలలో భారత, అమెరికా దేశాల మధ్య మైత్రికి కొంత విఘాతం కలిగింది.

1971లో భారత పాకిస్థాన్ దేశాల మధ్య జరిగిన యుద్ధంలో భారతదేశం విషయంలో అమెరికా ప్రతికూల వైఖరి ప్రదర్శించింది. 'అణ్వస్త్ర వ్యాప్తి నిరోధపు ఒప్పందం' మీద సంతకం పెట్టడానికి భారతదేశం నిరాకరించింది. భారతదేశం జరిపిన అణుశక్తి పరీక్ష విషయంలోనూ అమెరికా ప్రతికూల వైఖరి ప్రదర్శించింది. ఈ కారణాలవలన భారత అమెరికా సంబంధాలు బెడిసిపోయాయి. అయితే గత కొద్ది నెలలుగా ఈ సంబంధాలు మెరుగవడం ప్రారంభించాయి. రెండు దేశాలలోనూ కొత్త ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. అతి త్వరలో ప్రెసిడెంట్ కార్టర్ భారతదేశంలో జరిపే పర్యటన రెండుదేశాల మధ్య మైత్రి మరింత పటిష్ఠం కావడానికి తోడ్పడుతుందని ఆశించవచ్చు.

## దక్షిణాఫ్రికా

ప్రపంచమంతా 'ఎన్నికల పర్వం'లో వున్నట్లు కనిపిస్తోంది. దక్షిణాఫ్రికాలో నవంబర్ 30న ఎన్నికలు జరపడానికి ప్రధాని జాన్ వోర్‌స్టర్ నిర్ణయం తీసుకున్నారు. దక్షిణాఫ్రికాలో ప్రతిపక్షం ఛిన్నాభిన్నమయి వోర్‌స్టర్ నేషనల్ పార్టీకి పెద్ద పోటీగా నిలవలేకపోవచ్చు. దక్షిణాఫ్రికా వ్యవహారంలో విదేశాల జోక్యాన్ని ఏమాత్రమూ సహించవద్దని దేశప్రజలకి వోర్‌స్టర్ పదేపదే విజ్ఞప్తి చేస్తున్నాడు. ఈ విజ్ఞప్తి ప్రభావం ప్రజల మీదా కనిపిస్తోంది. పార్లమెంట్ అధికారాన్ని తగ్గించి, ప్రెసిడెంట్‌కి సర్వాధికారాలూ ఇవ్వడానికి నేషనల్ పార్టీ ప్రయత్నిస్తోంది. ఈ 'మార్పు' రావడానికి వోర్‌స్టర్ ఎన్నికలలో గెలవడమే తరువాయి.

## చైనా స్నేహ హస్తం

భారతదేశం, చైనా ఒకరోజున చాలా సన్నిహితంగా వుండేవి. అయితే 1962లో భారతదేశం మీదకి చైనా దండెత్తి కొంత భూభాగాన్ని ఆక్రమించుకుంది. అప్పటి నుంచి రెండుదేశాల మధ్య సంబంధాలు క్షీణించిపోయాయి. భారత దేశం స్నేహవైఖరిని అవలంబించినా చైనా పెడసరంగానే వుంటూ వచ్చింది. చైనాలో గత కొద్దినెలలలో ఎన్నో మార్పులు రావడంతో చైనా వైఖరిలోనూ మార్పు వచ్చింది. భారతదేశంతో దౌత్య సంబంధాల పునరుద్ధరణకు చైనా అంగీకరించింది. భారతదేశంతో సన్నిహిత సంబంధాన్ని కోరుతున్నట్లు చైనా నాయకులు యుగోస్లావియా అధినేత మార్షల్ టిటో, అమెరికా విదేశాంగ మంత్రి సైరస్‌వాన్స్‌లతో చెప్పడం జరిగింది.

తమదేశం పర్యటించవలసిందిగా కొంతమంది భారతీయ ప్రముఖులనూ చైనా ఆహ్వానిస్తోంది. ఇటీవల జరిగిన ఐక్యరాజ్య సమితి సమావేశంలో చైనా భారతదేశాన్ని 'పల్లెత్తు మాట' అనలేదు. భారతదేశంతో మైత్రికి చైనా ముందడుగు వేస్తున్నందుకు ఇప్పుడు 'ప్రపంచం' హర్షిస్తోంది.

ఈ దీపావళి శుభ సందర్భంలో "వాణి"
సమర్పించు రంగు రంగులతో

క్రొత్త డిజైన్
పూంబుహార్

క్రొత్త బార్డర్
భైరవి

క్రొత్త బుట్టా
వరలక్ష్మి

క్రొత్త రంగు
వాణి

వివాహాలు మరియు
అన్ని శుభకార్యాలకు

మా
ఆదాయ
పొదుపు పథకంలో
చేరి లాభం
పొందండి!

# వాణి సిల్క్ హౌస్

"జైన్ భవన్"
92, పాండిబజార్ (మేడమీద)
టి. నగర్, మద్రాసు-600 017
ఫోన్: 446440



# లక్ష్మీ పౌర్ణమి

ప్రతి ఏడాదీ దుర్గాపూజ అయ్యాక వచ్చే మొదటి పౌర్ణమినాడు రాత్రి వంగదేశంలో చాలామంది 'కజగరి లక్ష్మీపౌర్ణమి' పేరిట పూజ చేసుకుంటారు. అప్పుడు ఐశ్వర్యప్రదాయిని అయిన లక్ష్మీదేవిని భక్తిప్రపత్తులతో పూజిస్తారు.

ఒక మంటి ప్రమిదలో నెయ్యి నింపి అందులో వత్తి వేసి దీపం వెలిగించి ఆ దీపం అలా రాత్రంతా వెలిగేలా చేస్తారు. అలా చెయ్యడంతో బాటు తమ యింటి తలుపులు కూడా తెరచి ఉంచుతారు. అలా తెరచి ఉంచిన తలుపులతో, వెలుగుతో కళకళలాడుతున్న తమ యింటికి లక్ష్మీదేవి శుభం కలిగిస్తుందని వారి విశ్వాసం.

అనగా అనగా ఎప్పుడో వంగదేశంలో ధనపతి అనే వర్తకుడు ఉండేవాడట. అతను ఒకసారి దూరప్రాంతాలకు వర్తకం కోసం బయలుదేరి వెడుతుండగా, శ్రీలంకకు వెళ్ళే దారిలో కాళీదాహ అనే చోట కమల (లక్ష్మీదేవి) అతనికి దర్శనమిచ్చిందట. అప్పటి నుంచీ వంగ దేశంలో లక్ష్మీపూజ ప్రారంభమైనదంటారు.

ఈ లక్ష్మీపౌర్ణమినాడు చేసే పూజను 'లక్ష్మీవ్రతం' అని కూడా అంటారు. లక్ష్మీవ్రతాన్ని వంగ యువతులు విధిగా ఆచరిస్తారు. ఇంటిలోని గదులన్నిటినీ నీటిలో తడిపిన బియ్యం పిండి పూసి అలంకరిస్తారు. ఇలా పూస్తున్నప్పుడు లక్ష్మీదేవి కాలి గురుతులనూ, లక్ష్మీదేవి వాహనమైన గుడ్లగూబనూ, వరికంకులను గుర్తిస్తారు. ఇంట్లో పూజ గదిలోగాని, ఇంటి ముంగిట్లోగాని లక్ష్మీదేవి విగ్రహాన్ని ఉంచుతారు. ఆ విగ్రహానికి కిరీటం అమర్చి, విగ్రహం పాదాల దగ్గర తామరపూవు, గుడ్లగూబ, వరికంకి మొదలైనవి ఉంచుతారు.

కొందరు లక్ష్మీదేవి విగ్రహానికి బదులుగా ఒక మంచం మీద ఒక కుండ ఉంచి, ఆ కుండ మీద లక్ష్మీదేవి పాదాల గుర్తులతోబాటు తామర పూవు, గుడ్లగూబ, వరికంకి, కొన్ని తీగెలు మొదలైనవాటిని చిత్రీకరిస్తారు.

ఇవికాక ఒక పళ్ళెం, ఒక గడ్డి వలయం ఉంచుతారు. అవేకాక ఒక కుండనిండుగా తాజాపళ్ళు ఉంచి దాని మీద ఒక మూత ఉంచుతారు. ఆ మూత మీద లక్ష్మీనారాయణులనూ గుడ్లగూబనూ, వరికంకినీ చిత్రీకరిస్తారు. దాని సమీపాన ఒక వెదురుబుట్ట ఉంచి అందులోను వడ్లు పోసి ఉంచుతారు.

లక్ష్మీదేవిని పచ్చరంగు చీరతో అలంకరిస్తారు. ఆమె శరీరాన్ని పసుపుతోను; పెదవులు, అరచేతులు, పాదాలు మొదలైనవాటిని ఎరుపు రంగుతోనూ అలంకరిస్తారు. లక్ష్మీదేవి ఆభరణాలు నీలంరంగులో చిత్రీకరిస్తారు.

ఒక అరటాకు మీద వడ్లు, తక్కిన ధాన్యాలు ఉంచి ఆ ఆకును లక్ష్మీదేవి ముందు ఉంచుతారు. అలా ఉంచి పూజ జరుపుతారు. లక్ష్మీవ్రతం ఆచరిస్తున్నవారు వ్రతం ముగిసేదాకా ఉపవాసం ఉంటారు.

వంగరాష్ట్రంలోని రైతులు ఈ లక్ష్మీవ్రతాన్ని మామూలుగా గురువారంనాడు జరుపుకుంటూ ఉంటారు. కొన్నిచోట్ల ఆదివారంనాడు ఈ వ్రతం జరుపుతారు. అయితే ప్రధానమైన లక్ష్మీపూజ మాత్రం కజగారి పూర్ణిమ నాడు జరుపుతారు. ఈ లక్ష్మీపూజను కోతలు అయ్యాక జరిపే కోతల పండుగగా కూడా పరిగణించవచ్చును. అయితే కేవలం కోతల పండుగగానే కాక అన్ని రకాల మేళ్ళు సమకూరడానికి కూడా లక్ష్మీపూజ చెయ్యవచ్చని ఆ పూజ గురించి చెప్పే ఫలశ్రుతి పేర్కొంటున్నది।

ఈ లక్ష్మీపూజ చేస్తున్న స్త్రీలు జుట్టు విరబోసుకుని దేవిని ప్రార్థిస్తుంటారు. తమ జుట్టులాగానే వరి విరగపండాలని వారు లక్ష్మీదేవిని ప్రార్థిస్తారట।

# అతిథులు-మర్యాదలు

అతిథిని భగవంతుడుగా భావించి అతనిని సత్కరించి అన్నదానంతో సంతృప్తిపరచి పంపడం భారత గృహస్థధర్మం—అన్నారు. ఈ ఉత్తమ ధర్మనిర్వహణలో భర్తకు చేదోడు వాదోడుగా వుండి లోకోత్తరమైన కీర్తినార్జించింది గృహిణి.

> " వండ నలయదు వేవురు వచ్చిరేని
> అన్నపూర్ణకు నుద్దియౌనతని గృహిణి
> అతిథులేతేర నడికిరేయైన బెట్టు
> వలయు భోజ్యంబులింట నవ్వారిగాగ."

అని అన్నాడు అల్లసాని పెద్దన తన కావ్యంలో (మనుచరిత్ర) ప్రవరుని భార్యను గురించి చెపుతూ. ఆ రోజుల్లో అతిథులెప్పుడు ఇంటికి వచ్చినా విసుగు, విరామం లేకుండా ఇల్లాలు స్వయంగా వండి వడ్డించేది. అది తన విధిగా భావించేది. అంటే ఆ రోజుల్లో ప్రజలు అంత సుభిక్షంగా ఉండేవారు. పాడికీ పంటకూ ఏ లోటూ లేదు. తామింత తిని పదుగురికి పెట్టగల స్తోమతగలవారే అధిక సంఖ్యాకులు. అందువలన ఆనాటి గృహిణి అతిథులను ఇష్టమృష్టాన్నకలనసంతుష్టులను చేసేది. అలాంటి ఈ భూమి మీదనే రేషన్ రోజులొచ్చి మన పొట్టలు గడవటమే కష్టంగా వుంటే అతిథి సత్కారాలెవడు చేస్తాడు? అని అందరూ అంటారు. అది నిజమే. అయితే పెద్దన మరో విషయం కూడా చెప్పాడు. ప్రవరుడు ప్రతి దినమూ పట్టణం నలుమూలలా తిరిగి తనకు కనిపించిన సిద్ధులనూ, ఇతర యాత్రీకులను తమ ఆతిథ్యం స్వీకరించవలసిందిగా ప్రార్థించి మరీ తీసుకువచ్చేవాడట. ఇలా చేయటం ఆ కాలంలో సాధ్యం కానీ, ప్రస్తుతానికి కానేకాదు. ఐతే ప్రవర దంపతుల్లా అతిథి సేవ చేయకపోయినా తమ శక్త్యానుసారం అతిథులను గౌరవించాలి. ఎంత కాదన్నా ఇంటికొచ్చిన వ్యక్తికి చూపవలసిన గౌరవ మర్యాదలను పాటించడం ముఖ్యం. వచ్చిన అతిథిని సాదరంగా ఆహ్వానించటం, కుశల ప్రశ్నలు వేయటం, వారితో కాస్సేపు కులాసాగా కబుర్లు చెప్పటం, ఏ కాఫీ ఫలహారాలో (తమకు తోచిన రీతిగా, వచ్చిన వ్యక్తిని బట్టి) ఇచ్చి పంపించాలి. ఈ రోజుల్లో ఇలా చేస్తే చాలు. అంతకన్నా ఎక్కువేమీ చేయవలసిన పనిలేదు.

అతిథి మర్యాదలు చేయడంలో పురుషునికన్న స్త్రీకే బాధ్యత ఎక్కువ. అతిథో, చుట్టమో పక్కమో గడపలోకి వస్తే ఆదరాభిమానాలు తొణికిసలాడే మందహాస ముఖారవిందంతో ఇల్లాలు ప్రత్యక్షమై నోటినిండా పలకరించి—త్రాగేందుకు మంచి తీర్థమిచ్చి యోగక్షేమాలు విచారించి ఆప్యాయంగా ఆతిథ్యమివ్వాలి. అలా చేస్తే వచ్చినవారి మనస్సు సంతోషిస్తుంది. అయితే వచ్చిన అతిథులు కూడా తిష్ఠ వేసుక్కూచోకుండా పరిస్థితులను బట్టి ఎంత త్వరగా ఆ ఇంటివారివద్ద సెలవు తీసుకుంటే అంత బావుంటుంది.

కొంతమంది ఇండ్లకు వెళితే కూర్చోమనైనా చెప్పరు. అదేమైనా సభ్యతగా ఉంటుందా? ఒకవేళ కూచోపెట్టినా తమను కాదన్నట్లు అతిథి వేపు తిరిగి చూడకుండా యంత్రాలకు మల్లే తమపని తాము చేసుకుంటూ వుంటారు. ఒకవేళ మాట్లాడినా—వచ్చినవారిని తప్పులు పట్టటం, తమ గొప్పని అదేపనిగా చాటుకోవడం లాంటివి చేస్తారు—కొందరు స్త్రీలు. వచ్చినవారి మనస్సును గాయపరచకుండా సంభాషించడం కూడా అతిథి సేవలో ఒక భాగమేనని ఎంతమంది గృహిణులు తలపోస్తున్నారు? ఎవరైనా మనింటికొచ్చి వెళ్ళితే, "ఆవిడ ఎంతో చక్కగా మాట్లాడింది, మళ్ళీ వెళ్ళాలి" అని అనిపించాలిగానీ, "అబ్బ ఎలాగోలా వదిలించుకొని వచ్చాంరా బాబూ" అని అనుకునేలా మనం అతిథులతో ప్రవర్తించ కూడదు. ఇంటికొచ్చినవారికి మన మీద గౌరవమూ, సదభిప్రాయమూ కలిగేలా ప్రవర్తించుకోవటం మన కర్తవ్యం.

ఇక ఇంటికొచ్చే అతిథులలో కూడా చాలా రకాలున్నారు. పూర్వపు రోజులవలె ఇప్పుడు ఎవరంటే వారు అతిథులుగా రావడం లేదు. బంధువులు, స్నేహితులు, ముఖ్యమైన పరిచయస్తులు మన ఇండ్లకు వచ్చి వెళ్ళుతూ ఉంటారు. కొందరు బంధువులలో—మనం ఎన్ని మర్యాదలు చేసినా మనపై చెడుగా ప్రచారం చేసేవారున్నారు. "మేము మీ ఇంటికొస్తే ఏమిస్తావు? నువ్వు మా ఇంటికొస్తే ఏం తెస్తావు?" అనే తరహాకు చెందిన అతిథులూ ఉన్నారు. ఇవ్వడం పుచ్చుకోవడం అనేవి వారి వారి ఆర్థిక పరిస్థితులపైన కూడా ఆధారపడి వుంటాయి. బంధువులతో కానీ, స్నేహితులతోకానీ తమ రాకపోకలు మితంగా ఉంచుకుంటేనే ఉభయులకూ శ్రేయస్కరం.

కొంతమంది స్త్రీలు ఒక వేళాపాళా లేకుండా పరుల ఇళ్ళకు వెళుతుంటారు. మనకేమీ పని లేదుకదాని ఆ సమయంలో ఎదుటి ఇల్లాలికి పని ఉండదని అనుకోవటం పొరపాటు. పని వున్న వేళల్లో వచ్చి ఆ ఇల్లాల్ని ఇబ్బంది పెట్టి మనను సరిగా మర్యాద చేయకపోతే గోరంతని

ఐటెక్స్
సౌందర్య సాధనములు

EYETEX REGD.

EYETEX KUMKUM PASTE 11 IN 1

EYETEX BINDI

EYETEX DELUX BINDI PENCIL

ARAVIND LABORATORIES MADRAS-600 033

---

**ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!**
**సాలోఫేన్‌ను వాడండి.**
**అమోఘంగా నొప్పులను నివారించే**
**విశిష్టమైన మాత్ర.**
**వెల అతిచౌక**

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్— అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒకమాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది. సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు— ఏళ్లతరబడి ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారీ.




అమృతాంజన్ లిమిటెడ్‌వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**— అమోఘమగు నిరపాయకరమైన నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL

కొండంతలుగా చేసి చెడుగా ప్రచారం చేయటం భావ్యం కాదు. తీరిక సమయాలలో వెళ్ళితే ఎవరూ ఏమీ అనరుకదా। ఇంకో రకం అతిథులు మనింటికొచ్చి మనపైనే పెత్తనం చెలాయిస్తారు. మన జేబు ఖాళీ చేయించి వెళ్ళటమే తప్ప. వీరికి నిజంగా మనపై అభిమానం ఉండదు.

సృష్టిలో అతివృష్టి, అనావృష్టి ఎలాగో అలాగే అతిథులను గూర్చి అసలు పట్టించుకోనివారు కొందరైతే, వచ్చిన వారిని అధిక మర్యాదలతో హడావిడి చేసేవారు మరికొందరు. వీరికి సాంఘిక మర్యాద గురించి తాపత్రయం ఎక్కువ. ఆ తాపత్రయం వల్లనే అనేక చిక్కుల్లో పడతారు. కొన్ని చోట్ల బలవంతపు మర్యాదలు జరుగుతూ వుంటాయి. కొందరి ఇళ్ళకు వెళ్ళితే అప్పటికప్పుడు పిల్లల్ని బజారుకి తరిమి స్వీట్లూ, కారం తెప్పించి పెడుతుందో ఇల్లాలు. మేము ఇంట్లో తీసుకునేవచ్చామని ఎంత మొత్తుకున్నా వినరు. వాళ్ళు పెట్టినవి తినలేక నానా అవస్థా పడవలసి వస్తుంది. వేళకాని వేళ నానా హడావిడీపడి కాఫీలు అందించటంవలన అటు ఆవిడకు ఖర్చు, శ్రమతోపాటు ఇటు వచ్చినవారికి అదనంగా పట్టించాలంటే ఇబ్బందిగానూ ఉంటుంది. మనం ఒకరినొకరు అర్థం చేసుకుని వచ్చినవారి మాట విని సర్దుకుపోవచ్చును. మర్యాదలు చేయడం లేదని ఎవరూ మనింటికి రావడం మానేయరు. అలా మానేశారా, అలాంటివారు మానేసినా ఫరవాలేదు. అతి స్వల్ప విషయాలను కూడా సర్దుకోలేనివారికి కాస్త దూరంగా ఉండటమే మంచిది.

ఇక కొత్తగా పెళ్ళయిన భార్యాభర్తలు ఎవరింటికైనా వెళ్ళితే ప్రతీ చోటా కాఫీ ఫలహారాలు ప్రత్యక్షమవుతాయి. వారిచేత మరీ బలవంతంగా తినిపించటం మనం చూస్తూనే వుంటాం. ఆ వచ్చినవారికిది ఎంత ఇబ్బందిగా వుంటుందో ఆలోచించము.

మా చుట్టాల్లో ఒకావిడ వచ్చిన చుట్టాల్ని ఉక్కిరిబిక్కిరి చేసేసి ఎక్కడికీ కదలనివ్వదు. నానా రకాలూ చేసి వడ్డిస్తుంది. వాళ్ళు తినకపోతే కోపగించుకుంటుంది, దెప్పుతుంది. ఘనంగా మర్యాద చేయకపోతే ఎలాగంటుంది? అవస్థలుపడైనా, అప్పులుచేసైనాసరే రాజోపచారాలు చెయ్యక మానదు. బంధుప్రీతి కాస్త ఎక్కువగా వున్నవారు ఇలాగే చేస్తుంటారు. తమ ఆర్థికపరిస్థితులను బట్టి మర్యాదలు చేయాలిగానీ, అప్పులు చేసి, కష్టపడి ఇల్లూ ఒళ్లూ గుల్ల చేసుకోవడం మంచిదికాదు. వేళను గమనించి, వచ్చిన అతిథులను బట్టి మని శక్త్యానుసారం చేయగలిగిన మర్యాదలు చేయాలి. అనవసరంగా భేషజాలకుపోకుండా రెండు వైపులవారూ సర్దుకుపోతుంటే కాలం ఉల్లాసంగా గడిచిపోతుంది.

ఇప్పటి పరిస్థితుల్లో చాలా కుటుంబాలు అతిథుల తాకిడి లేకుండా వుంటేనే గుట్టుగా జరిగేట్లున్నాయి. అటువంటివి తప్పని సరైనప్పుడు ఇరువైపులవారూ ఒకర్నొకరు అర్థం చేసుకుని ఎవరికీ ఇబ్బంది కలుగకుండా ప్రవర్తిస్తే మంచిది.

—గార్ల సరస్వతి

## 'సంక్రాంతి'కి నవలల రచనల పోటీ

**మొదటి బహుమతి రూ. 3,000**

**రెండవ బహుమతి రూ. 2,000**

* ఈ నవలల పోటీలో పాత, కొత్త రచయిత్రులు — ఎవరైనా సరే పాల్గొనవచ్చును.

* పై రెండు స్థానాలలో ఎన్నికైన నవలలకు పైన ప్రకటించిన ప్రకారం బహుమతులు ధన రూపంలో వుంటాయి - ఈ మొత్తాలు-'సంక్రాంతి' పండగకు ముందే, గెలుపొందిన వారికి అందుతాయి.

* పై రెండే కాకుండా, పోటీకి వచ్చిన తక్కిన వాటిల్లో కూడా బాగున్న నవలలు ఏవైనా వున్నట్టయితే-వాటికి రూ. 1,000 చొప్పున పారితోషికం వుంటుంది।

**పాటించవలసిన చిన్న నిబంధనలు**

1. సమకాలీన స్త్రీకి సంబంధించిన ఎలాంటి సమస్యనైనాసరే ఇతివృత్తంగా తీసుకుని–నవలా రచన జరగాలి.
2. లిఖిత ప్రతి తావు (ఫుల్‌స్కేప్) సైజులో 250 పేజీలకు తగ్గకుండానూ, 300 పేజీలకు మించకుండానూ వుండాలి.
3. లిఖిత ప్రతిలో కొట్టివేతలూ, దిద్దుబాట్లూ లేకుండా, గజిబిజి రాత కాకుండా, శుభ్రంగా తెలిసేలా వుండాలి. పేజీకి ఒక పక్కనే, సిరాతో రాయాలి. రచన వాడుకభాషలోనే సాగాలి.
4. ఈ నవల ఏ తెలుగు రచనకుగాని, ఇతర భాషా రచనకుగాని–అనుకరణగాని, అనువాదంగాని కాదని — పూర్తిగా సొంతంగా రాసినదేనని, ఇదివరలో ఏ రూపంలోనూ ఎప్పుడూ, ఎక్కడా ప్రచురణగాని, ప్రసారంగాని కాలేదనీ–హామీ పత్రం రాసి, సంతకం చేసి–నవలతోపాటు జత చెయ్యాలి।
5. ప్రచురణకు స్వీకరించబడే నవలలోని భాగాలను అవసరమైతే — ఎక్కడైనా తొలగించడానికిగాని, తగ్గించడానికిగాని — 'వనిత' సంపాదకవర్గానికి హక్కు వుంటుంది.
6. స్వీకరింపబడిన రచనలు 'వనిత'లో విశేష నవలలుగా ప్రచురింపబడతాయి. నవల మీద — ఈ ప్రచురణ హక్కు తప్ప, ఇంకెలాంటి హక్కులూ 'వనిత'కు వుండవు. 'వనిత'లో ఆ నవల పూర్తిగా ప్రచురణ అయిన తర్వాత నవలకు సంబంధించిన తక్కిన హక్కులన్నీ రచయిత్రివే.

నవలలు చేరవలసిన ఆఖరు తేదీ: 5–12–77

☐ **స్వీకరింపబడని నవలలను రిజిష్టర్డ్ పోస్ట్‌లో తిరిగి పంపడానికి తగినన్ని స్టాంపులు నవలతో పాటే పంపాలి.**

మొదటి బహుమతి పొందిన నవల 15–1–78 'సంక్రాంతి సంచిక'లో ఆరంభమవుతుంది.




డాక్టర్ శశికళ పేషెంటుకు ఇంజక్షన్ ఇచ్చి, జాగ్రత్తగా చూస్తూండమని నర్స్‌కుచెప్పి, నర్సింగ్ హోం వరండాలోకి వచ్చింది.

అక్కడ బికారిలా నిలబడి వున్నాడు సారథి. అతని ముఖం దిగులుతో పీక్కుపోయింది. గడ్డం పెరిగింది. వారం పదిరోజుల నుండి ఉపవాసం చేసిన వాడిలా ఉన్నాడు. అసలు అతనే ఒక పేషెంటులా వున్నాడు.

డాక్టర్ని చూడగానే సారథి ఆత్రుతగా ఆమె దగ్గరికి వచ్చాడు.

"డాక్టర్, నా పాపకు ఏమీ ప్రాణాపాయం లేదుకదా? ప్లీజ్ చెప్పండి" అంటూ దాదాపు ఏడ్చినంత పనిచేశాడు.

"ఎంత ఖర్చయినా సరే, నా తల తాకట్టు పెట్టయినా డబ్బు తెస్తాను. వైద్యం చేయించండి డాక్టర్‌గారూ!" అక్కడే ఉన్న ముసలాయన చేతులు నులుపుకుంటూ ప్రార్థిస్తున్నాడు.

శశికళ మౌనంగా ముందుకు కదిలి పోర్టికోలో ఉన్న కారు ఎక్కింది.

ఆమె వెంటే వస్తున్న మరో నర్స్ "డాక్టరమ్మ వైద్యం చేయడానికి ఒప్పుకున్నారంటే, ఇక మీ బిడ్డకు బాగయినట్టేనయ్యా, మీరేం అదుర్దా పడకండి. ఆమె గురించి మీకేం తెలిసినట్లు లేదు" అంటూ వెళ్ళిపోయింది.

అక్కడే బెంచీపై కూర్చున్న మరో పేషెంటు తాలూకు బంధువులు, "ఏమిటండీ సుస్తీ? ఎవరికి?" అని ప్రశ్నించారు.

ముసలాయన చెప్పాడు. "వీడు నా కొడుకు బాబూ, వీడి కూతురు పదేళ్ళపిల్ల. వారం రోజుల కిందట స్టౌ దగ్గరికి వెళ్ళి ఒళ్ళు కాల్చుకుంది. మా ఊరి హాస్పిటల్లో చికిత్స చేయించాం. కానీ బాగయ్యే సూచనలు కనిపించలేదు. ఈ డాక్టరుగారు బాగా వైద్యం చేస్తారని విన్నాం. అంచేత ఇక్కడికి తీసుకొచ్చాం. పిల్ల మన తెలివిలో లేదు. ఆ భగవంతుడు మమ్మల్ని ఏం చేయాలనుకున్నాడో తెలీదు" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు.

# సగంలో ఆగిన ఆల్బమ్

బి. స్వర్ణాంబ

ఆ ఎదుటి వ్యక్తి. ''డాక్టరమ్మగారి హస్త వాసి మంచిదండీ. అసలు, అనుమానంగా వుంటే ఆమే పెద్దాసుపత్రికి తీసికెళ్ళి పొమ్మంటారు. మీ పిల్ల లక్షణంగా మీ ఇంట్లో తిరుగుతుంది దిగులు పడకండి'' అని ముసలాయన్ని ఓదార్చాడు.

సారథి లోపలికివెళ్ళి కూతుర్ని చూసి వచ్చాడు. ''నాన్నా నువ్వు ఇంటికి వెళ్ళు. నేనిక్క-డుంటాను!'' అని తండ్రిని పంపేశాడు.

*

డాక్టర్ శశికళ ఇంటికి వచ్చి తన రూములోకి వెళ్ళి మంచం మీద వాలిపోయింది. ఆమె మనస్సులో ఎన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగు తున్నాయి. సారథి తనను గుర్తుపట్టినట్టు లేదు. బహుశః అతని మనసంతా కూతురిపట్ల భయాం దోళనలతో నిండి ఉంది కాబట్టి, మరే ఆలోచనా అతని మనసులోకి వచ్చి వుండదు. కన్నకూతురు చావుబ్రతుకుల్లో ఉందన్న సత్యం అతని మనసును కాల్చేస్తోంది. కానీ తను సారథిని గుర్తించింది! అతనూ, అతని తండ్రీ పసిబిడ్డకు ప్రాణాలు పోయమని దేవిరించినపుడు—తన తండ్రి ఒకప్పటి రూపం వాళ్ళల్లో కనబడింది. అప్పుడు తన తండ్రి పడ్డ ఆవేదన ఎంతటిదో తనకర్థమైంది. అవును... అది నిజమే. ఎప్పుడైనా బాధననుభవించే వారి హృదయావేదన ఎదుటివారికి ఎందుకర్థమౌతుంది? అందుకే సారథికీ, వాళ్ళ తండ్రికీ తమ గోడు తెలియలేదు. కానీ తన విషయం ఇప్పుడలా కాదు. తను డాక్టర్‌గా ఎన్నో చావులు చూసింది. వాళ్ళ తాలూకు బంధువులు హృదయవిదారకంగా విలపిస్తోంటే వాళ్ళ ఆవేదనను తను అర్థం చేసుకోగలదు. ఎవరి జీవితంలోనైనా చావు ఒక్కసారే వస్తుంది. అంతకుమించిన ఆపద లేదంటారు. కానీ కొన్ని జీవితాల్లో చావులాంటి ఆపదలు అడుగడుగునా తారసిల్లుతూనే వుంటాయి. మృత్యువు కంటే భయంకరంగా అది వ్యక్తి మీద దెబ్బ కొడుతుంది. ఆ మనిషిని క్రుంగదీస్తుంది. చావుతో ఒక్కసారిగా మనిషి బాధలు మాయ మౌతాయి; కనీసం ఆ మరణించిన వ్యక్తికి! కానీ కొన్ని కష్టాలు అలాకాదు. ఆమరణాంతమూ అవి పీడిస్తూనే ఉంటాయి. దానికి తన జీవితమే ఒక ఉదాహరణ....

శశికళ మెల్లిగా బీరువా తాళం తీసింది. అందులో లాకర్‌లో ఉన్న ఫోటో ఆల్బం తీసుకున్నది. ఆ ఆల్బంలో సగం పేజీలు ఫోటోలతో నిండిపోయాయి. మిగిలిన సగం ఖాళీగా వుంది తన మనసులాగే....తన జీవితం లాగే. మిగిలిన సగం ఆల్బం ఎప్పటికీ పూర్తవదు! దాన్ని పూర్తిచేసే ఫోటోలు ఇక ఎన్నటికీ తీయ బడవు!

కుర్చీలో కూర్చుని ఆల్బం తెరిచింది ఆమె.

మొదటి పేజీలో పెళ్ళివారంతా పెద్ద గ్రూప్ ఫోటోలో ఉన్నారు. స్టేషన్‌లో వాళ్ళంతా రైలు దిగగానే తీసిన ఫోటో అది. అన్నయ్యకు ఫోటోలు తీయడం సరదా. అందుకనే అన్ని ఫోటోలు తీశాడు. పెళ్లికొడుకు అందరిమధ్యా కంపార్ట్ మెంట్ దగ్గర నిలబడి వున్నాడు.

రెండో ఫోటో తమ ఇంట్లో తీసింది. ముత్తైదు వల మధ్య తాను, పెళ్లికూతురి వేషంలో. స్నేహితురాండ్రంతా ఏవో ఛలోక్తులు విసురుతూ నవ్వుతున్నారు. తనకింకా జ్ఞాపకం. తన ఫ్రెండ్ సుజాత, పెళ్లికొడుక్కిమ్మని ఒక ప్యాకెట్ తన చేతిలో పెట్టింది. అందులో ఏముందో చూడగూడ దనీ, తను అత్తవారింటికి వెళ్ళాక ఇద్దరూ కలిసి చూడాలనీ చెప్పింది. తన గుప్పిట్లో ఆ చిన్న పెట్టె వుంచి గుప్పిలి మూసింది. తన పిడికిలిని అదిమి పట్టుకున్న సుజాత చెయ్యి; ఇద్దరి ముఖాల్లో నవ్వులు. కానీ ఆ పెట్టెలో ఏముందో చూసే అవకాశం రాలేదు. రాదు కూడా! మూడో ఫోటో-పెళ్లికొడుకు కాశీ యాత్రలో ఉన్నాడు. తన తండ్రి, తమ్ముడు, అన్నయ్య అందరూ అతన్ని చుట్టుముట్టి నిలబడ్డారు.

తర్వాతి ఫోటోలు దాదాపు చాలావరకు పెళ్ళి కొడుకు వైపువారివి. అతని అక్కయ్యా, తల్లీ. తన తల్లీ తండ్రితో ఏదో మాట్లాడుతున్నారు. ఒక ఫోటోలో.

ఇంకో ఫోటోలో తన తండ్రి, పెళ్ళికొడుకు తండ్రికి ఏదో చెబుతున్నాడు. ఎందుకో తన తండ్రి ముఖంలో ఆందోళన; కూతురి పెళ్ళి జరుగు తోందన్న ఉత్సాహం లేదు....

తర్వాతి ఫోటోల్లో పెళ్ళిమంటపంలో పెళ్ళి కొడుకు, పురోహితుడు ఏదో పూజ చేయిస్తున్నాడు. ఇంకో ఫోటోలో తను గౌరీపూజ చేస్తోంది. మరో ఫోటోలో తను పెళ్ళిపీటలపైన; ఇటూ, అటూ అమ్మా, నాన్నా! కూతుర్ని కని, పెంచి, పెద్దచేసి మరొకరితో ఆమె జీవితాన్ని ముడిపెట్టబోతున్న తరుణం. తల్లిదండ్రుల భావాలెలా ఉంటాయో! తన తల్లి ముఖంలో సంతోషం, దిగులు ఏవేవో భావాల కలయిక. అంతే....ఆ తర్వాత ఫోటోలు లేవు.

ఆల్బం సగంలో ఆగిపోయింది. కారణం.... సంతోషకరమైన జ్ఞాపకాల కన్నా దిగులుతో కూడిన జ్ఞాపకాలే జీవితంలో వెంటాడుతాయి. వాటికి ఏ ఫోటోలూ తీయనవసరం లేదు. అవి శాశ్వతంగా మనస్సనే కెమెరాలో బంధింపబడి ఉంటాయి. ఆ బరువు జ్ఞాపకాలే తన తల్లి జీవి తాన్ని అంతం చేశాయి.

## వార్త

జెమ్‌షెడ్‌పూర్‌లోని ఆంధ్ర మహిళా సమితి, ఆంధ్ర మహిళా సమితి ఈస్ట్‌జోన్ కలిసి—ఇటీవల జెమ్‌షెడ్‌పూర్‌లో ''తెలుగు వెలుగు'' కార్య క్రమాన్ని ఏర్పాటు చేశాయి. దాదాపు రెండువేల మంది ఆ కార్యక్రమానికి హాజరై—ఎంతో ఆనం దించారు. ఆంధ్ర మహిళా సమితి ఈస్ట్‌జోన్ అధ్యక్షురాలు శ్రీమతి నళినీ ప్రసాద్—గ్రామీణ గీతాలద్వారా, జానపదుల జీవన విధానాలను తెలియజేసే ఉద్దేశంతోనే ఆ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినట్టుగా చెప్పారు. అందులో ఇరవై ఇద్దరు కళాకారులు—పశువులను తోలుకువేటప్పుడు పాడే పాటలు, సాతాని జియ్యరు పాటలు, నీళ్ళకు వెళ్ళే పడతుల పాటలూ, కోతలప్పుడు రైతులు పాడే పాటలు, పడవ పాటలూ, దంపుళ్ళ పాటలూ, బండిపాటలూ, ఎంకి పాటలూ పాడి, శ్రోతలను ముగ్ధులను చేశారు. కొన్ని పాటలకు సందర్భాను సారంగా 'షాడోప్లే' చూపారు. కొన్నింటికి భావం వివరిస్తూ, వ్యాఖ్యానించారు. కొన్ని పాటలకు చిన్నపిల్లలు చేసిన అభినయాలు కూడా చూడ ముచ్చటగా వున్నాయి.

ఆ జ్ఞాపకాల బారినుండి తప్పించుకోవాలనే తను మెడిసిన్‌లో చేరింది. డాక్టరయింది. తన తండ్రి ఈలోకం నుండి నిష్క్రమించాడు. ఇప్పుడు తను రోగులపాలిటి దేవత; ఎందరికో శారీరక బాధలు తొలగింపజేసే డాక్టర్. కానీ తన గుండెలోని గాయం మాత్రం ఎవరూ మాన్పలేరు. తనవల్ల తల్లీ, తండ్రీ మరణించారనీ, కుటుంబం అశాంతిపాలయిందనీ తలుచుకుంటే మనస్సు మండిపోతుంది. కానీ దానికి తానెంతవరకూ కారకురాలు?

# కొత్తది!

## అమూల్ మాల్ట్-కోకో పానీయం

# న్యూట్రామూల్

## ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు

Nutramul
AMUL'S NOURISHING DRINK
500g Net

ప్రతి డబ్బాలో 50 గ్రాముల ఎక్కువ సరుకు

అమూల్ బలాన్నిచ్చే న్యూట్రామూల్–ఇంతకుమునుపెన్నడూ అందించబడని ఆరోగ్యాన్నిచ్చే పానీయం సమర్పిస్తోంది. సమృద్ధిగా పాలు, శుద్ధమైన మాల్ట్, ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజములుగలది, ప్రతి కప్పు ఆరోగ్యాన్ని, శక్తినీ పెంపొందిస్తుంది.

మరిక దీని రుచి! అమ్మమ్మ! ఎంతో ఎక్కువ కోకో మరెంతో ఎక్కువ పాలు. సమృద్ధియైన నురుగు గల కోకో గలది.

న్యూట్రామూల్, అమూల్‌వారి కొత్త పాలు మరియు ఆహారాల ప్రోసెసింగ్ కేంద్రంలో—ప్రపంచంలో మేలైన వాటిలో ఇది ఒకటి—రూపొందించబడుతోంది.

ప్రతి న్యూట్రామూల్ డబ్బాలో 500 గ్రాముల సరుకు ఉంటుంది. అంటే ఇతర వాటికన్న 50 గ్రాములు (5 కప్పులు) అదనం అన్నమాటేగా.

న్యూట్రామూల్ నేడే వాడి చూడండి.





మార్కెట్ చేయువారు :
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

daCunha/Nutra/1 E



సోవియట్ యూనియన్‌లోని ఆర్టెక్‌లో ఆ మధ్య అంతర్జాతీయ బాలల వేసవి విడిది కార్యక్రమం నెల రోజులపాటు జరిగింది. అందులో ఆంధ్రదేశంనుంచి గోపిశెట్టి సుజాత అనే అమ్మాయి కూడా పాల్గొన్నది. ఈ అమ్మాయి వయసు 13 సంవత్సరాలు. గుంటూరులోని బాల కుటీర్‌లో 10వ తరగతి చదువుతున్నది. సుజాత – నాట్యం బాగా చేస్తుంది. జిల్లా స్థాయిలోనూ, రాష్ట్ర స్థాయిలోనూ జరిగిన జానపద నృత్యాల పోటీలలో చాలాసార్లు పాల్గొని, బహుమతులు గెల్చుకున్నది. జలంధర్‌లో ఆ మధ్య జరిగిన అఖిల భారత మహిళా సమాఖ్య మహా సభలలోనూ, కటక్‌లో జరిగిన ఇండో–జి డి ఆర్ మిత్ర మండలి మహాసభలలోనూ ఆమె నాట్య ప్రదర్శలు ఇచ్చి, అభినందనలూ, ప్రశంసలూ పొందింది.

ఆర్టెక్ కాంప్‌లో కూడా సుజాత, నాట్య ప్రదర్శనలు ఇచ్చి – స్వర్ణపతకం గెల్చుకున్నది. అలాగే మాస్కోలోని భారత దౌత్య కార్యాలయంలో కూడా నాట్య ప్రదర్శనలు ఇచ్చింది.

ఫోన్ మోగింది....శశికళ జ్ఞాపకాల వర్షం ఆగిపోయింది. రిసీవర్ అందుకుంది. నర్స్ చెబుతోంది....ఆ పాపకు–సారథి కూతురికి–తెలివొచ్చిందట! కానీ పిచ్చిచూపులు చూస్తోందనీ, త్వరగా రమ్మని....

శశికళ వెంటనే పోర్టికోలోకి వచ్చి కారెక్కింది. "అమ్మగారూ! భోంచేయరూ?" వంటమనిషి ప్రశ్నిస్తోంది.

కారు స్టార్ట్‌చేసింది శశికళ.

*

"అమ్మా! శశికళా, నిన్ను చూడగానే గుర్తుపట్టలేకపోయాను. ఆ తర్వాత జ్ఞాపకం వచ్చింది. ఆనాడు నీకు చేసిన అన్యాయానికి, నీవు ఈరోజు చేసిన ఉపకారంతో, మా తల తీసేసినట్లయింది. నీవు కసి తీర్చుకోవాలనుకుంటే క్షణం కూడా పట్టివుండేది కాదు. నీకు అన్ని విధాలా అన్యాయం కలిగింది. అయినా నీదెంత పెద్దమనసు? మమ్మల్ని క్షమించు తల్లీ!" ముసలాయన – సారథి తండ్రి – బ్రతిమాలుతున్నాడు. శశికళ మౌనంగా పేషెంటు దగ్గరినుంచి కదలి, మరో పేషెంటు దగ్గరికి వెళ్ళిపోయింది.

సారథి వంచిన తల ఎత్తలేదు. పాప దగ్గరే కూర్చున్నాడు. పాపకు నిద్రపట్టింది. సారథి ఆలోచనలు కదిలాయి. ఆరోజు పెళ్ళిపీటలపై నుండి తనెంత మూర్ఖంగా లేచి వచ్చేశాడు? తన తండ్రి పట్టుదల అది. కట్నం డబ్బులో నాలుగు వేలు తగ్గాయిట! ఎలాగో తర్వాత సర్దుతానని శశికళ తండ్రి బ్రతిమాలాడు. ఎంతగానో అభ్యర్థించాడు. వేర్వేరుగా తనను, తండ్రిని, తల్లినీ, దేవిరించాడు. పెళ్ళికూతురికి అన్యాయం చేయొద్దన్నాడు. "దానికింక పెళ్ళి కాదండీ. నా పరువు నట్టేట్లో కలిసిపోతుంద"ని వాపోయాడు. కానీ వాళ్ళ అభ్యర్థనలేవీ తమ తలకెక్కలేదు. చివరికి శశికళ పీటలమీద నుండి లేచి లోపలికి వెళ్ళిపోయింది. అంతా ఆశ్చర్యపోయారు. ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమోనని భయపడ్డారు.

కానీ అలాంటిదేం జరగలేదు. శశికళ అన్నయ్య వచ్చి పెద్ద దుమారం లేవదీశాడు. ఇట్లాంటి డబ్బు మనుషులకు తన చెల్లెల్ని ఇవ్వననీ, ఒకవేళ వాళ్ళను బతిమాలి ఈ పెళ్ళి జరిపిస్తే తను ఈ ఇంటికి రాననీ చెప్పి వెళ్ళిపోయాడు. ఎలాగైతేనేం పెళ్ళి ఆగిపోయింది. ఆ తర్వాత తనకు శారదతో పెళ్లి జరిగిపోయింది. •శశికళకు చాలరోజుల వరకు పెళ్లి కాలేదని విన్నాడు. తర్వాత వాళ్ళ సంగతులేవీ తనకు తెలీలేదు. ఈ సమాజంలో, పీటల మీది పెళ్లి చెడగొట్టి లేచి వెళ్లిన మగవాడికి వెంటనే పెళ్ళి జరిగిపోతుంది. ఆ దౌర్భాగ్యుడికి పిల్లనిచ్చే కన్యాదాతలెందరో వుంటారు. కానీ ఆడదానికి మాత్రం అదొక మచ్చగా మిగిలిపోతుంది!!

*

శశికళ ఒక్కొక్క పేషెంటునే చూస్తూ ఆప్యాయంగా పలకరిస్తూ, నర్సింగ్ హోం అంతా తిరుగుతోంది. సారథి పాపను తీసుకుని వెళ్ళి టాక్సీలో కూర్చోపెట్టాడు. శశికళ దగ్గరికి వచ్చి "డాక్టర్! మీకు ఎలా థ్యాంక్స్ చెప్పుకోవాలో తెలీలేదు. మా పాపను బ్రతికించి ఇచ్చారు." అంటూ నమస్కారం చేశాడు.

శశికళ నవ్వింది. "మీరు ప్రత్యేకించి నాకు కృతజ్ఞతలు చెప్పనక్కర్లేదు. ఆ నాడు పెళ్లి పీటల మీదే నా బ్రతుకు మలుపు తిరిగింది. మీరు తిరస్కరించిన కట్నం, నాకే చదువు చెప్పించి నన్ను డాక్టర్‌గా నిలబెట్టింది. ఈ నాడింతమందికి నేను నా చేతనైన సేవ చేయడానికి కారణమైంది. ఆ మలుపే లేకుంటే నేనూ మీ రెండో భార్య శారదలాగే ఆత్మహత్య చేసుకొని మరో లోకంలో ఉండేదాన్ని. ఇంతమందికి జీవితం ప్రసాదించవలని ఉండబట్టే దేవుడు నన్ను చావు నుండి కాపాడాడు. అందుకు మీకే నా థ్యాంక్స్. వెళ్ళి రండి....సారీ ఇది హాస్పిటల్ కదూ? వెళ్ళండి–" అంటూ వెనక్కి తిరిగి వెళ్లిపోయింది శశికళ.

తను పెట్టిన బాధలు పడలేక శారద ఆత్మహత్య చేసుకున్న సంగతి శశికళకు తెలుసా? ఎలా తెలుసు? అని ఆశ్చర్యపోతూ ముందుకు రెండడుగులు వేశాడు సారథి. "మిష్టర్ సారథీ, ఒకమాట!" శశికళ కంఠం విని వెనక్కి తిరిగాడతను.

"మీ పాప తల్లి–అంటే శారద–నా స్నేహితురాలు. దాని కూతురిని జాగ్రత్తగా చూసుకోండి ఇకనైనా. ఆమెను మీరు పెంచలేనినాడు నా దగ్గరికి పంపేయండి, అంతేకానీ మరో మరణానికి కారకులు కాకండి–" శశికళ గంభీరంగా అని లోపలికి వెళ్ళిపోయింది.

చెట్టంత మగవాడు, కట్నం ఇవ్వలేదని పీటల మీద పెళ్ళి చెడగొట్టి కన్నె హృదయాన్ని గాయపరచిన మగవాడు, భార్యను ప్రేమగా చూసుకోలేని మగవాడు—సారథి – పాపం – బరువుగా అడుగులేస్తూ వెళ్ళి టాక్సీ ఎక్కాడు ☐

పాఠకుల శీర్షిక

# "నేర్చుకున్న గుణపాఠం"



వేము మద్రాసు నుండి విజయవాడ వచ్చిన కొత్తల్లో "సంపూర్ణరామాయణం" చిత్రం విడుదలైనది. కొత్త సినిమా విడుదలైన రెండు మూడు రోజులలోనే చూడాలని నాకు, మా ఇరుగు పొరుగున ఉన్న నా కొత్త స్నేహితురాళ్ళకూ కోరిక. సినిమా వచ్చిన మూడో రోజున పిల్లలతో సహా మొత్తం ఏడెనిమిదిమందిమి మ్యాట్నీ షోకు బయలుదేరాము. హాలువద్ద జనం కిటకిటలాడుతున్నారు. ఇంటికి తిరిగి వెళ్దామంటే మగవాళ్ళ వద్ద ఏదో అవమానంగా ఫీలవుతామేమోనని, అటూ, ఇటూ తిరుగుతున్నాం. పెద్ద పిల్లలను క్యూలలో నిల్చోబెట్టాము. ఇంతలో ఒక పిన్నిగారు మా వద్దకు వచ్చి "ఏమ్మా! రిజర్వేషన్ చేయించుకున్నారా?" అంటూ అడిగారు. మేము "లేదండీ! అయినా ఇంత రష్‌గా వుంటుందనుకోలేదు. పిల్లలు వెళ్దామంటే వచ్చామండీ" అంటూ ఆమెతో సంభాషణ మొదలు పెట్టాము. ఆమె సంభాషణ సారాంశం ఏమిటంటే, తనూ, భర్తా వచ్చారట. చుట్టాలెవరో వస్తామంటే మొత్తం ఎనిమిది టికెట్లు రిజర్వు చేయించుకొన్నారట. ఇంతసేపు ఎదురుచూశారట, చుట్టాలు రాలేదుట. ఆమె భర్త "ఇవాళ వద్దు తర్వాత వెళ్దాము" అంటున్నాడట. "మీకు కావాలంటే మీ బాబాయిగార్ని అడిగి టిక్కట్లు తెచ్చియిస్తా" అన్నది ఆమె. మాకు దూరంగా టీ త్రాగుతున్న లావాటి కళ్ళజోడు బాబాయిగార్ని చూపిస్తూ. నేను, నా ఫ్రెండ్సు మూడు పదిరూపాయల నోట్లు ఆమె చేతిలో పెట్టి, యింక ఎవ్వరికీ యివ్వక, తప్పక ఆ ఎనిమిది టికెట్లు మాకే యివ్వాలని గట్టిగా చెప్పాము. ఆమె సరేనంటూ నవ్వుతూ బాబాయిగారి వద్దకు వెళ్ళింది. ఆయనతో ఏదో మాట్లాడుతోంది. ఆయన టీ అందిస్తే తాగింది. మాకు ఎంతో సంతోషంగా వుంది. మాలో మేము మాట్లాడుకుంటూ పిన్నిగారి వంకే చూస్తున్నాం. ఐదు నిమిషాలైనది. పిన్నిగారు కనబడలేదు. హాలులోకి తొందరగా వెళ్ళాలన్న ఆదుర్దాతో మేమే బాబాయిగారివద్దకు వెళ్ళాం. "ఏమండీ టికెట్లసంగతి ఏం చేశారు?" అన్నాం. "ఏం టికెట్లమ్మా" అన్నారు ఆయన ఆశ్చర్యంగా. "ఇప్పుడు మాట్లాడేరే మీతో పిన్నిగారు, ఆమె ఏం చెప్పలేదా?" అన్నాను ఏడుపుగొంతుతో. "ఎవరూ? ఓహో ఆమేనా! ఆమె ఎవరో నాకు తెలియదు. పిక్చర్ మొదలెట్టడానికి ఎంత టైం ఉన్నదని అడిగింది. గుంపుగావుంది—కాస్త ఓ కప్పు టీ యిటు అందివ్వమంది. ఇచ్చాను." అంటూ ఆయన యింకా ఏదో చెప్తున్నారు. అవేమీ మా చెవుల్లో పడలేదు. జరిగిన మోసం తెలుసుకున్నాం. గబగబ పిచ్చివాళ్ళల్లా సినిమా హాలంతా తిరిగాం. ఎక్కడా ఆమె కనబడలేదు. ఇప్పటికీ ఆమె ఎక్కడన్నా కనపడుతుందేమోనని చూస్తుంటాను. పచ్చని శరీరచ్ఛాయ, కళ్ళజోడు, జరీచీర, నగలు, ఎత్తుగా చుట్టిన సిగ, సిగ నిండా పూలు—దాదాపు నలభై సంవత్సరాల వయస్సున్న పిన్నిగారు అలాంటి మోసం చేస్తుందని ఎవరైనా అనుకుంటారా?

—నందనవనం జయలక్ష్మి



ఆ మధ్య నేనొక పేరంటానికి వెళ్ళాను. అప్పటికే చాలా చీకటిపడింది. అందరూ వచ్చి వెళ్ళిపోయారు. నేను వెళ్ళేసరికి ఎవరూ ఆ గదిలో లేరు. నేను అటూ, ఇటూ చూస్తున్నాను. అంతలో పేరంటాళ్ళకోసమని వేసిన జంబుఖానా మీద ఒక వస్తువు మెరుస్తూ నా కంటపడింది. అది ఎవరిదో — ఎర్రరాళ్ళు పొదిగిన చెవి లోలాకు. పిలిచి చెబుదామంటే అక్కడ నాకు ఎవరూ కనబడలేదు. సరే నేనే తీసి వాళ్ళకి ఇచ్చేద్దామన్న ఉద్దేశంతో దాన్ని తీయబోయాను. అంతలో ఎప్పుడో చదివిన ఒక సంఘటన చటుక్కున గుర్తువచ్చింది. అంతే. నాకు భయమేసింది. అది నేను తీయడం ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? నేను దాన్ని పట్టుకుపోవడానికే తీశాననుకుంటారు. నా మనస్సులో ఉన్న అభిప్రాయం చెప్పినా 'మనం చూశాం గనుక ఇచ్చేసింది లేకపోతే....' అనుకుంటారు. పోనీ లోపలికి వెళ్ళి ఎవరికైనా చెబుదామా అంటే, వాళ్ళ పని పిల్ల అప్పుడే ఇల్లు ఊడవడానికని చీపురుతో వచ్చింది. నేను తిరిగివచ్చేలోపల అది తీసేస్తే? ఎలాగ? ఏం చెయ్యడం? అని ఆలోచించి 'కమలా! కమలా!' అని వాళ్ళ అమ్మాయిని కేకవేశాను. కాని ఎవరూ పలకలేదు. అప్పు పని పిల్లని పిలిచి "మీ అమ్మగారిని పిలు. ఎవరో పేరంటాలు వచ్చారని చెప్పు" అన్నాను. ఆ అమ్మాయి వెళ్ళి ఆవిడని పిలుచుకురాగానే జరిగిన విషయమంతా చెప్పి, అది ఆవిడకిచ్చేశాను. ఆవిడ చాలా సంతోషించారు. కాని ఇంతలో వారి బంధువుల అమ్మాయి ఒకామె వచ్చి చాలా నిర్మొహమాటంగా నాతో "మీరేమీ అనుకోకపోతే ఒక మాట చెప్తాను. మీరు రాగానే అలికిడి విని నేను ఇవతలకి రాబోయాను. కాని మీరు ఈ చెవి లోలాకును చూస్తూ నిలబడడం చూసి అసలు మీరేం చేస్తారో చూద్దామని గది గుమ్మంలోనే కర్టెన్ చాటుగా నిలబడ్డాను. మీరు వంగబోయి ఆగిపోవడం చూసి తీద్దామా వద్దా అని ఆలోచిస్తున్నారని, మీరు మా కమలని పిలవడం చూసి 'మనని ఎవరైనా గమనిస్తున్నారా లేదా? చుట్టుప్రక్కల ఎవరైనా ఉన్నారా లేదా?' అని పరీక్షిస్తున్నారనీ, ఇంతలో పని పిల్ల రావడంతో 'అమ్మగార్ని పిలు' అని దాన్ని ఏదో వంకపెట్టి లోపలికి పంపించారనీ అనుకున్నాను. కాని అలా అనుకున్నందుకు ఇప్పుడు చాలా బాధపడుతున్నాను. మీ సమయ

స్ఫూర్తిని మెచ్చుకుంటున్నాను. మీరుగాని అది తీసి ఉంటే మీరన్నట్టు అది మీరు పట్టుకుపోవ డానికే తీశారనుకొందును'' అన్నది. ఆమె నిర్మోహమాటానికి ఆశ్చర్యపోయాను. తేరుకుని ''ఈ రోజు నేనెంత అదృష్టవంతురాల్ని. క్షణంలో 'దొంగ' అన్న పేరు వచ్చి ఉండేది కదా?'' అనుకున్నాను. ఇప్పటికీ, ఎప్పటికీ నా గుండె దడదడలాడుతుంది. మనం మంచి చేయబోయినా లోకం దాన్ని చెడుగానే భావిస్తుంది. కనుక ఏదైనా చేయబోయేముందు ఆలోచించడం, అలాగే ఇతరులు ఏదైనా చేస్తుంటే వారేం చేస్తారో చివరి దాకా గమనించడం మంచిది కదా?

—నల్లపాటి లక్ష్మి



మాది మధ్యతరగతి కుటుంబం. ముగ్గురు అక్క చెల్లెళ్ళం; నలుగురు అన్నదమ్ములు. అమ్మాయిల్లో నేనే పెద్దదాన్ని. మా అమ్మగారు నా మెడ బోసిగా ఉంది, ఎదిగినపిల్ల అని పోరితే, మా నాన్న గారు ఏదో లోన్ తీసికొని, ఇంట్లో కొద్ది బంగారం ఉంటే అది కూడా కలిపి రెండుపేటల గొలుసు చేయించారు. అది నేను వేసుకొన్నప్పుడు మా అమ్మగారి కళ్ళల్లోని మెరుపు నాకెప్పుడూ గుర్తు ఉంటుంది.

ఆ రోజు వినాయకచవితిపండుగ. నేను, మా చెల్లెలు క్రొత్త సినిమాకు వెళదామని ఆ సాయంత్రం అనుకొన్నాము. పండుగపూట క్రొత్త సినిమాకు వెళ్ళొద్దని మా అమ్మగారు అన్నారు. ఆ రోజు వెళితేనే బావుంటుందని చెప్పి బయల్దేరాము. మేము వెళుతుంటే 'ఆ మెళ్ళోది జాగ్రత్త. పమిటచెంగు భుజం మీదుగా కప్పుకో జాగ్రత్త' అని మా అమ్మగారు హెచ్చరించారు. మా అమ్మగారి చాదస్తానికి నవ్వుకొన్నాను. నా అలవాటుప్రకారంగా పైట మామూలుగా వేసు కొని (కుడిభుజం మీదుగా కప్పుకోకుండా) వెళ్ళాము. క్రొత్త ఆట, పండుగరోజు! జనం విపరీతంగా ఉన్నారు. నేను టిక్కెట్లు తెస్తానని క్యూలో నుంచొన్నాను. అప్పటికే నా ముందు పదిమంది ఉన్నారు. అప్పుడే టిక్కెట్లు ఇవ్వడం మొదలుపెట్టారు. అతి కష్టం మీద నిలద్రొక్కు కొని టిక్కెట్లు తీసుకొని బయటికి వచ్చాను. మొహమంతా చెమట్లుపట్టాయి. జుట్టు చెదిరి పోయింది. ఎలాగైతేనేం టిక్కెట్లు దొరికాయని సంతోషించి వెళ్ళి లోపల కూర్చున్నాము. అలవాటుగా పైట సర్దుకొంటుంటే, నా చేతికి గొలుసు తగలలేదు. నా గుండె ఆగినంత పని అయింది. మా చెల్లెలికి చెప్పాను. వెంటనే బయటికి వచ్చేశాము. నాకు కళ్ళ వెంబడి నీళ్ళు వచ్చేస్తున్నాయి. మా చెల్లెలు హాలు మానేజర్‌తో చెపుదామని అంటే సరేనని వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాము. ''ఇలాంటి చోట్ల చాలా జాగ్రత్తగా ఉండాలి. తీసినవాళ్ళు హాలులో కూర్చోరు. కాబట్టి మేమేమీ చేయలేము'' అని చెప్పారు. ఇక ఇంటికి వచ్చాము. మా అమ్మగారు మమ్మల్ని చూసి ''టిక్కెట్లు దొరకలేదా?'' అని అడిగారు. నేను తలవంచుకున్నాను. చెల్లెలు జరిగిన సంగతి మెల్లగా చెప్పింది. అప్పుడు మా అమ్మగారు, ''మేము ఏమి చెప్పినా మీకు చాదస్తాలుగా ఉంటాయి. పైట నిండుగా కప్పుకోవటానికి నీకు నామోషీ. మళ్ళీ గొలుసు చేయించగలమా?'' అని మందలిస్తూనే బాధపడ్డారు. ఏదైనా తనదాకా వస్తేనేగాని తెలియదంటారుగదా! నాకు ఆ క్షణంలో — మా అమ్మగారు చెప్పినట్లు విని ఉంటే గొలుసు పోయేదికాదేమోనని అన్పించింది. తర్వాత ఎంత బాధపడినా, పోయిన వస్తువు తిరిగి రాదుగదా!

—ఉండవల్లి సుబ్బలక్ష్మి




నేను హైస్కూలు వరకు చదువుకున్నాను. పుట్టింది, పెరిగింది పల్లెటూరులో అయినా ఇప్పుడుంటున్నది మద్రాసు నగరంలో. మా వారు సినిమా కంపెనీలో దర్శకత్వశాఖలో పని చేస్తుం టారు. వారు ఉదయం వెళ్తే ఏ రాత్రికో వస్తుం టారు. అందువలన పప్పులు, బియ్యం, మందులూ, కాయగూరలులాంటి నిత్యావసర వస్తువులు నేనే తెచ్చుకునేదాన్ని. భాష కొంత అలవాటయిం తర్వాత నాకు ఎంతో హాయిగా ఉంది — మొదట ఇబ్బంది పడినా!

నాకో చెడ్డ అలవాటు ఉంది. వాళ్ళు ఏ సరుకిస్తే అదే తెచ్చుకునేదాన్ని, వాటి మంచి చెడులు అడగడం అసలు అలవాటే లేదు. ఆ అలవాటే ప్రమాదం తెచ్చింది.

ఒకసారి మా చిన్నమ్మ మద్రాసు చూడాలని వచ్చింది. వచ్చింది మొదలు రెండు రోజులు వరసగా బీచీ, జూ, పార్కు, విమానాశ్రయం, స్టూడియోలు తిరిగాము. ఒక సాయంత్రం ఆమె గుండెల్లో నొప్పంటూ, క్రిందపడి కొట్టుకోసాగింది. నాకెంతో భయం వేసింది. అదృష్టవశాత్తు మా డాక్టరుగారు వచ్చారు. పరీక్షచేసి మందులు రాసిచ్చి మరో గంటలో తిరిగి వస్తానన్నారు. పిల్లలు ఎవరూ లేకపోవడంతో నేనే మందులషాపుకెళ్ళి అర్జంటుగా మందులు తెచ్చాను. మందు రెండు స్పూనులు ఇచ్చాను. నొప్పి తగ్గాల్సింది బదులు, ఎక్కువయి నోటంట నురుగులు కక్కసాగింది. నాకు గుండెదడ ఎక్కువయింది. ఆమె నొప్పి నాకొచ్చినట్లయింది. కాలూ చెయ్యి ఆడలేదు. వెంటనే మావారికోసం స్టూడియోకు ఫోన్ చేశాను. తిరిగి మా డాక్టర్‌కోసం ప్రయత్నించగా ఆయన మా ఇంటికే బయలుదేరారని చెప్పారు కంపౌండరు.

బయటికొచ్చి చూస్తే డాక్టరుగారు స్కూటరు దిగుతున్నారు. డాక్టరుగారు మా చిన్నమ్మను పరీక్షచేసి అయోమయంలో పడ్డారు. మందులసీసా వైపు చూశారు: ''ఈమందు ఎవరు తెచ్చారు? ఇది డేట్ ఎక్స్‌పయిరీ అయిన మందు. ఇది వాడ కూడదు. అపాయం'' అన్నారు. నాగుండె దాదాపు ఆగిపోయింది. మావారొచ్చారు. డాక్టరు ఏవేవో మందులు, ఇంజక్షన్‌లు యిచ్చారు. ''నేను రావడం ఆలస్యమయితే....?'' అని మా డాక్టరు అడుగుతుంటే ఏం చెప్పాలో నాకు పాలుపోలేదు.

మావారు, నేనూ, డాక్టరు — కంపెనీ కారులో మందులషాపుకెళ్ళి సీసా చూపించి అడిగితే, షాపు అతను బిల్లు అడిగాడు. అది తన షాపులో కొనలేదని బుకాయించాడు. తప్పునాది—డేటు చూడకుండా కొనడం, తొందరలో బిల్లు తీసుకోకపోవడం! ఆ

[35వ పేజీ చూడండి]




# సోవియట్ వనితా దర్శకులు

"ఏ రంగంలోనైనా స్త్రీలు ముందంజ వెయ్యడం అన్నది అరుదుగా జరుగుతున్నా, వారు ఏ రంగంలోనైనా ముందంజ వేస్తే మాత్రం ఆ రంగంలో ఉన్న పురుషులతో పోటీచేసి వారిని మించిపోవడానికి ప్రయత్నిస్తూ ఉంటారు" అన్నాడు ఒక అనుభవజ్ఞుడు. ఆ అనుభవజ్ఞుడి మాటలను నిజం చేస్తున్న వనితలలో ఇద్దరు–లారిసా షెపిట్కో, దినారా అసనోవా. సోవియట్ యూనియన్‌కు చెందిన ఈ యిద్దరు వనితలూ చలనచిత్ర దర్శకురాళ్ళుగా తక్కిన వనితలకు ఆదర్శం కాగలవారు.

ప్రపంచం మొత్తంమీద చలనచిత్ర దర్శకత్వం చేపట్టిన స్త్రీల సంఖ్య బాగా తక్కువ. చిత్ర నిర్మాణంలో ముందంజ వేసిన వివిధ దేశాల చలన చిత్ర చరిత్ర చూస్తే చాలా కొద్ది మంది దర్శకురాళ్ళే కనిపిస్తారు. భారతదేశం విషయమే తీసుకుంటే దక్షిణ భారత తారలు టి. పి. రాజ్యలక్ష్మి (భారత దేశపు తొలి దర్శకురాలు), భానుమతి, సావిత్రి, విజయనిర్మల, షీలా, హిందీనటి సాధన, బెంగాలీనటి అరుంధతీదేవి మొదలైన కొందరే కనిపిస్తారు.

సోవియట్ యూనియన్‌లో దర్శకురాళ్ళుగా పేరు తెచ్చుకున్నవారిలో యూలియా సొల్న్‌త్సెవా, టాటియానా లియొజ్నవా, లారిసా షెపిట్కో ప్రముఖులు. దినారా అసనోవా ఇటీవలే ఈ మార్గ దర్శకురాళ్ళ స్థాయిని చేరుకున్నవారు.

ఇటీవల బెర్లిన్ చలన చిత్రోత్సవంలో బంగారు ఎలుగుబంటి బహుమతి పొంది ఉత్తమ చిత్రంగా ఎన్నికైన 'ది అసెంట్' (ఆరోహణ) చిత్రానికి దర్శకత్వం వహించిన లారిసా షెపిట్కో అంతర్జాతీయ చిత్ర ప్రముఖుల ప్రశంసలు అందుకున్నారు. 'ప్రేమకూ ద్వేషానికీ మధ్య జరిగే సంఘర్షణను చిత్రీకరించిన చిత్రం'గా ప్రశంసలందుకున్న ఈ చిత్రం రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో జర్మన్‌ల స్వాధీనంలో ఉన్న బైలో రష్యా ప్రజల బాధామయ గాథను వివరించింది.

నాజీలకు లొంగిపోక, తనవారికి ద్రోహం చెయ్యలేక గుండె నిబ్బరంతో ఉరికంబం ఎక్కిన షోట్నికోవ్ ఈ చిత్రంలోని ప్రధాన పాత్ర. వాసిల్ బైకోవ్ వ్రాసిన 'షోట్నికోవ్' అనే నవల ఆధారంగా నిర్మించిన ఈ చిత్రాన్ని లారిసా షెపిట్కో ఎముకలు కొరికే బైలోరష్యా చలిలో చిత్రీకరించడం పెద్ద సాహసం!

'ఆరోహణ' చిత్రం చాలా కటువుగా ఉందని కొందరు అభిప్రాయపడ్డారు. సున్నితంగా, అందంగా సినిమా తారలా కనిపించే లారిసా షెపిట్కో ఇటువంటి చిత్రాన్ని ఎలా రూపొందించారు?

లారిసా షెపిట్కో జీవితం మీద రెండవ ప్రపంచయుద్ధం ఎంతో గాఢమైన ప్రభావాన్ని చూపింది. యుద్ధం ఆమె జీవితం మీద చెరగని ముద్ర వేసింది. "అమానుషమైన పరిస్థితులలో అవస్థపడుతున్న మానవుడు తనలోనుంచి తానే శక్తిని కూడదీసుకుంటాడు. ఆ మానవుడి కథలో లాలిత్యానికి ఆస్కారం ఎక్కడ ఉంది?" అని ప్రశ్నిస్తారు లారిసా. "'బ్రతికి ఉండిన సుఖములు బడయ వచ్చు' అనుకుని ప్రాణాలకోసం ప్రాకులాడడం కన్నా మానవత్వం గల మనుషులుగా మనుగడ చాలించడం మేలు కదా?" అంటారు ఆమె.

బడి చదువు ముగియగానే పదిహేనేళ్ళ ప్రాయంలో మాస్కో ఫిలిం స్కూల్‌లో చేరిన లారిసాను నటన నేర్చుకుని తార కమ్మని ఎందరో సలహా యిచ్చారు. కాని ఆమె మాత్రం దర్శకత్వ శాఖలో చేరాలని నిర్ణయించుకున్నది. చలన చిత్రాలను అందమైన కవితలుగా తీర్చిదిద్ది, అలా 'చలన చిత్ర కవి'గా పేరు గడించిన ప్రముఖ దర్శకుడు అలెగ్జాండెర్ డొవ్‌జెంకో శిక్షణలో ఆమె దర్శకత్వం అభ్యసించింది. అలా ఒకటిన్నర సంవత్సరాల బాటు ఒక్క చలన చిత్ర



లారిసా షెపిట్కో

దర్శకత్వం గురించే కాక, చలన చిత్ర 'కళ' గురించీ, జీవితం గురించీ డొవ్‌జెంకో దగ్గర ఆమె ఎన్నో పాఠాలు నేర్చుకున్నది.

"నా జీవితమంతా గడిచాకగానీ ఆయన దగ్గర నేను ఏం నేర్చుకోగలిగానో చెప్పలేము. ఆయనకు శిష్యులు, అనుయాయులువంటి ఒట్టి మాటలు ఇష్టం కావు. కాని నాకు ఏదన్నా ఇబ్బంది వచ్చినప్పుడు, డొవ్‌జెంకో నేర్పిన వాటినుంచి ఉపశమనం పొందుతుంటాను," అన్నారు లారిసా.

డొవ్‌జెంకో చివరి చిత్రమైన 'పోయెమ్ ఆఫ్ ది సీ' (1955)లో లారిసా చిన్న పాత్ర కూడా ధరించారు. ఆ అనుభవం గురించి చెబుతూ ''ప్రతి డైరక్టరూ కెమెరాకూ అవతల ఉండడం అంటే ఏమిటో తప్పకుండా తెలుసుకోవాలను కుంటాను నేను'' అంటారు ఆమె.

మాస్కో ఫిలిం స్కూల్ నుంచి పట్టభద్రు రాలైన లారిసా-'మాస్‌ఫిల్మ్'లో చేరి ప్రముఖ సోవియట్ చిత్రస్రష్ట అయిన 'మిఖేల్ రామ్' (నైన్ డేస్ ఆఫ్ ఎ యియర్ చిత్రం ద్వారా ప్రసిద్ధి గడించినవారు) పర్యవేక్షణలో పని చేశారు. స్వతంత్రంగా దర్శకత్వ బాధ్యత చేపట్టి 'వింగ్స్', 'తర్టీన్త్ అవర్' (టి. వి. చిత్రం), 'యూ అండ్ ఐ', 'హీట్' మొదలైన చిత్రాలు రూపొందించారు. 'వింగ్స్' గురించి అభిప్రాయం చెబుతూ మిఖేల్ రామ్ ''ఈ చిత్రం పురుష హస్తాల ద్వారా రూపొందింది!'' అన్నారు.

లారిసా షెపిట్కో చిత్రాల గురించి ఎన్నో అభిప్రాయాలు ఉన్నాయి. వాటి గురించి ఆమె అభిప్రాయం ఏమిటి?

''హాస్యం మీ ఒంటికి ఆరోగ్యకరమే కావచ్చు. కాని మిమ్మల్ని కలతబెట్టి, మిమ్మల్ని రెచ్చగొట్టే చిత్రాలు కూడా అవసరమే!'' అంటారు ఆమె. ఆమె చిత్రాలు చూసేవారికి-మనిషి బుద్ధి శక్తినీ, భుజ శక్తినీ కూడా పరీక్షలకు గురిచేసి, మామూలు మనుషులనుంచే మానవోత్తములు పుడతారన్న నిజాన్ని ఆమె చాటి చెప్పడం స్పష్టమవుతుంది.

ఆ మధ్య విడుదలైన 'ది నాన్ ట్రాన్స్‌ఫరబుల్ కీ' అనే చిత్రం చూసి, ఆ చిత్రానికి దర్శకత్వం వహించిన దినారా అసనోవాను 'అంత మంచి చిత్రం' రూపొందించినందుకు అభినందించబోగా, ''అప్పుడే అభినందనలా? నేను ఇంతకన్నా గాఢమైనదేదైనా రూపొందించాలనుకుంటున్నాను'' అన్నారు ఆమె.

'ది నాన్ ట్రాన్స్‌ఫరబుల్ కీ' అనే చిత్రం బడి చదువు ముగించి జీవితంలో అడుగు పెట్టబోతున్న విద్యార్థినీ విద్యార్థులకు సంబంధించినది. ''మీకు అవకాశం లభిస్తే మానవజాతికి మీరేం చెబుతారు?'' అనే ప్రశ్నతో ప్రారంభమైన ఈ చిత్రం చాలామంది దృష్టిని ఆకర్షించింది; ఎన్నెన్నో ప్రశంసలు గడించింది.

దినారా-సోవియట్ కిర్ఘిజియా ముఖ్య పట్టణమైన ఫ్రుంజ్‌లో జన్మించారు. ఆమె తండ్రి రిపోర్టర్‌గా పని చేసేవారు; ఆమె తల్లి ఒక వార్తా పత్రికా కార్యాలయంలో టైపిస్ట్‌గా పనిచేసే వారు. దినారా పుట్టడానికి ముందే ఆమె తండ్రి యుద్ధ రంగంలో మరణించారు. ఆ తర్వాత ఆమె అవ్వ ఆమె తండ్రి స్థానం వహించి ఆమె పెంపకం గురించి శ్రద్ధ వహించారు. ఆ అవ్వ దినారాకు ఎన్నెన్నో కథలు చెప్పేది. అలా దినారాకు కథల పట్ల ఆసక్తి పెరిగింది.

దినారా అసనోవా-చలన చిత్రప్రేమ చాలా చిత్రంగా ప్రారంభమైంది. చిన్నప్పుడు ఎప్పుడో ఆమె చూసిన '13' అనే చిత్రం ఆమెను ఎంతగానో ఆకర్షించింది. మిఖేల్‌రామ్ రూపొందించిన ఆ చిత్రం ఆమెకు చలనచిత్ర కళలో అభినివేశం కలిగించింది. అలా మిఖేల్ రామ్ ఆమెకు ఆదర్శం అయ్యారు.



దినారా అసనోవా

దాంతో ఆమె 'ఆల్ యూనియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సినిమాటోగ్రాఫీ'లో చేరి చలన చిత్ర కళలో ఆరితేరాలనుకున్నారు. ఆ ధ్యేయంతోనే ఆమె మాధ్యమిక పాఠశాలలో చదువు ముగించి తమ పదహారవయేట కిర్ఘిజ్ ఫిల్మ్ స్టూడియోస్‌లో చేరారు. అక్కడ ఆమె తమకు చేతికందిన పనల్లా చెయ్యసాగారు; అలా అంచెలంచెలుగా సహాయ దర్శకురాలు అయ్యారు. లారిసా షెపిట్కో రూపొందించిన 'హీట్' చిత్రంలో దినారా సహాయ దర్శకురాలుగా పని చేశారు. ఆ తర్వాత ఆమె 'ఈచ్ హాస్ హిస్ ఓన్ రోడ్' అనే చిత్రంలో ప్రధాన పాత్ర ధరించి, నటిగా కూడా పేరు తెచ్చుకున్నారు.

ఇలా ఇన్ని పనులు చేస్తున్నా ఆమె తన అసలు ధ్యేయం మరిచిపోలేదు. స్టూడియోలో రెండేళ్ళపాటు పని చేశాక ఆమె 'ఆల్ యూనియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సినిమాటోగ్రాఫీ'లో చేరారు. అక్కడ ఆమె కథా చిత్రాల శాఖలో కాక డాక్యుమెంటరీల శాఖలో చేరారు. అక్కడ మిఖేల్ రామ్ శిక్షణ ఇవ్వడమే అందుకు కారణం!

అలా ఐదేళ్ళపాటు ఆ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొంది ఆమె చిత్ర నిర్మాణం గురించిన సిద్ధాంత జ్ఞానమూ, ప్రయోగాత్మక పరిజ్ఞానమూ గడించారు. ''లెక్చర్స్ ముఖ్యమైనవే. కాని ప్రయోగాత్మక జ్ఞానం మరింత ముఖ్యం'' అనే వారు మిఖేల్ రామ్. ఆయన తమ దగ్గర శిక్షణ పొందుతున్న యువ దర్శకులకు కొంత ఫిల్మ్ ఇచ్చి వారిని స్వతంత్రంగా చిత్రీకరణ జరపమని చెప్పేవారట.

ఆ తర్వాత దినారా అసనోవా లెనిన్ గ్రాడ్‌లోని లెన్ ఫిల్మ్ స్టూడియోస్‌లో పని చేయడం ప్రారంభించారు. 1974 లో ఆమె రూపొందించిన 'వుడ్‌పెకర్స్ డోంట్ గెట్ హెడ్ ఏక్స్' అనే చిత్రం చిత్ర ప్రముఖుల దృష్టిని ఆకర్షించింది. ఆ చిత్రాన్ని పోలండ్, రుమానియా, స్కాండినేవియన్ దేశాలు కొన్నాయి.

'ది నాన్ ట్రాన్స్‌ఫరబుల్ కీ' చిత్రం దినారాను మంచి దర్శకురాలుగా నిరూపించింది. త్వరలో ఆమె 'ట్రబుల్' అనే చిత్రానికి దర్శకత్వం నిర్వహించబోతున్నారు. ఇదివరలో ఆమె చిత్రాలలో బాలలకు, యువకులకు ప్రాధాన్యం ఉండేది. ఈ కొత్త చిత్రం-పెద్దలకు సంబంధించి ఉంటుందని ఆమె చెప్పారు.

దినారా కృషి చిత్రాలకు దర్శకత్వం వహించడానికి మాత్రమే పరిమితం కాలేదు. ఆమె బాలల కథల రచయిత్రిగా, చిత్రకారిణిగా కూడా ప్రసిద్ధి గడించారు.

లారిసా షెపిట్కో, దినారా అసనోవా ముమ్ముందు మరిన్ని ప్రయోజనాత్మక చిత్రాలకు దర్శకత్వంవహించిమరింత పేరు తెచ్చుకుంటారు; అలా తక్కిన స్త్రీలకు ఆదర్శమూ అవుతారు!

## ఉన్నత పదవిలో

# చంద్రకాంతి ఘర్యాలి



"చదువుకుంటున్న రోజుల్లో నాకు సాంఘిక సేవ చెయ్యడం మీద ఉత్సాహం ఉండేది. అలా ఢిల్లీలో వున్న కొన్ని కొన్ని స్వచ్ఛంద సేవా సంస్థల్లో పనిచేస్తూ – నేనుగా 'సొసైటీ ఫర్ మెంటల్ హెల్త్' అన్న సంస్థను ఆరంభించాను. ఈ సేవ చేస్తున్నప్పుడు, ఎందరో ప్రభుత్వ అధికారులను కలుసుకోవలసి వచ్చేది; వాళ్ళకి నచ్చచెప్పవలసి వచ్చేది. అప్పుడు ఒక సారి-నాకే అనిపించింది- 'నేనే ఇలాంటి ప్రభుత్వ ఉన్నతాధికారినైతే! ఒకరికి ఇలా నచ్చచెప్పవలసిన అవసరం వుండదు గదా. నేనే ఆ హోదాలో వుంటే, ఎన్ని మంచి కార్యాలో చెయ్యవచ్చును గదా.' అని. ఆ ఆలోచనే నన్ను ఐ.ఎ.ఎస్ చదవడానికి పురిగొల్పింది!" అని చెప్పారు – మద్రాసు గవర్నర్‌కు కార్యదర్శిగా పనిచేస్తున్న శ్రీమతి చంద్రకాంతి ఘర్యాలి.

విశేషం ఏమిటంటే–మనదేశంలో గవర్నర్లకు కార్యదర్శులుగా వనితలు ఇంకెవరూ లేరు. ఆహోదాలో వున్న 'ఏకైక వనిత' ఆమే!

తొలినుంచి సాంఘిక సేవలో ఆమెకు ఉత్సాహం వున్నందువల్ల, ఢిల్లీలోని 'స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్'లో చదివి 'మెడికల్ అండ్ సైకియాట్రిక్ సోషల్‌వర్క్'లో 1970లో డిగ్రీ తీసుకున్నారు.

ఘర్యాలి చదువుకుంటున్న రోజుల్లో ఎప్పుడూ 'బ్రిలియంట్'గానే వుండేది. సాంఘిక సేవలో 'యూనివర్శిటీ ఫస్ట్'గా నిలబడి, 'దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ అవార్డ్'నూ; 'మహర్షి కార్వే అవార్డ్'నూ పొందింది. తన చదువులో ఒక భాగంగా 'పరిశోధన' కూడా చెయ్యసాగింది. 'కాశ్మీర్‌లోని తివాసీల తయారీలో బాలల పాత్ర' అన్నది–పాఠ్యభాగం.

"చిన్న చిన్న పిల్లలు – నాలుగైదేళ్ళవాళ్ళు తివాసీ పన్లు చేస్తూ వుంటే చూసినప్పుడు, నేను ఎంతగానో ఆశ్చర్యపోయాను! తివాసీలు నేయడం, వాళ్ళకి ఆ వయసు నుంచే నేర్పుతారట. నిజానికి, వాళ్ళ లేత లేత వేళ్ళతో, కష్టమైన ముడులను కూడా, అతి తేలిగ్గా, నైపుణ్యంగా వెయ్యడం చూస్తూ వుంటే, చాలా ఆశ్చర్యంగా వుంటుంది" అన్నారామె.

"స్త్రీలు ఎప్పుడుగాని ఉద్యోగ కాంక్షతో విద్య నభ్యసింపరాదు. తమ జాతి పురోభివృద్ధికి దోహద మొనర్చునట్టియు, భారత జాతీయాదర్శములకు అడ్డు రానట్టియు, భావి సంతానమును సుశిక్షితముగా నొనర్చునట్టియు, గృహలక్ష్మల నామమును సార్థకపరచునట్టియు, గృహోపకరణముల నలవరచుకొనుటకు ముఖ్యముగా కావలసినట్టియు విద్యా పద్ధతులనే భారత నారీమణు లార్జింపవలయునుగాని స్వార్థమునకై యేసేవకావృత్తికైనను పూనుకొనరాదు."

— కె. రామసుబ్బమ్మ

మాస్టర్ డిగ్రీ తీసుకున్న తర్వాత–చంద్రకాంతి రెండు పరిశోధనా కార్యక్రమాలను చేపట్టారు. ఒకటి: "ఢిల్లీ పట్నంలోని వృద్ధుల సమస్యలు." రెండోది—ఇండియన్ కౌన్సిల్ ఫర్ మెడికల్ రిసెర్చ్ వారి నిర్వహణలో జరిగింది. పథకాలను రూపొందించడంలోనూ, విషయ సేకరణ చెయ్యడంలోనూ ఆమె ఎంతో ఉత్సాహం చూపేది. డాక్టర్లు అందరూ కూడా కేవలం రోగిని శారీరకంగానే చూడకుండా, మానసికంగా కూడా చూసి, అతని వ్యాధిని మానసిక పరిస్థితితో ముడిపెట్టి పరిశీలించాలి! అలా ఆ సబ్జెక్ట్ తీసుకున్నవారందరూ ఢిల్లీలో వున్న ఒక ఆసుపత్రిలోని డాక్టర్లనూ, రోగులనూ పరిశీలించారు.

ఆ పరిశీలనలో తేలిందేమిటంటే–చాలామంది రోగుల రోగాలమీద, వారి మానసిక స్థితి ప్రభావం బాగా కనిపించడం! మనిషి ఆరోగ్యం అతని మానసిక స్థితిమీదనే ఎక్కువగా ఆధారపడి వుంటుందన్న సత్యాన్ని డాక్టర్లు గమనించవలసిందిగా–తేల్చారు. "దానివల్లనే, సామాన్య వైద్యశాస్త్రం చదువుకుంటున్న వారందరికీ 'మనస్తత్వశాస్త్రం' కూడా, ఒక సబ్జెక్ట్‌గా ప్రవేశపెట్టడం జరిగింది!" అని చెప్పారు–చంద్రకాంతి.

చంద్రకాంతి రిసెర్చ్ ఆఫీసర్‌గా పనిచేస్తున్న రోజుల్లో మద్రాస్ మెడికల్ కాలేజీలో సైకియాట్రీ అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న డాక్టర్ రాజ్‌కుమార్‌ను కలుసుకున్నారు. అప్పుడు డాక్టర్ రాజ్‌కుమార్, సైకియాట్రీలో పోస్ట్



గ్రాడ్యుయేట్ కోర్స్ చదువుతున్నారు. తానుకూడా ఐ. ఎ. ఎస్ చదివి, తమిళనాడులోనే స్థిరపడ వచ్చునన్న భావంతో – చంద్రకాంతి, డాక్టర్ రాజ్‌కుమార్‌ను వివాహం చేసుకున్నారు.

1973లో చంద్రకాంతి ఐ. ఎ. ఎస్‌లో జేరారు. అక్కడ్నుంచీ తమిళనాడులోని వివిధ జిల్లాలలో, వివిధ హోదాలలో ఉద్యోగాలు చేశారు. దీనివల్ల ఆమెకు – ప్రజలు, వారి సమస్యలూ బాగా అర్థమైనాయి.

"ఇలాంటి ఉద్యోగాలు నిర్వహించడానికి, నేను భావించినట్టుగానే–అప్పట్లో నేను పొందిన శిక్షణ బాగా సహాయపడింది." అన్నారామె.

ప్రస్తుతం–గవర్నర్ కార్యదర్శిగా ఆమె కొత్త 'పాత్ర'ను నిర్వహిస్తున్నారు. ఎందరో వ్యక్తులను, విభిన్న కార్యకలాపాలలో వున్న వారిని కలుసుకోడానికి, ఈ ఉద్యోగం ఆమెకు ఎంతో అవకాశం ఇస్తున్నది. రాజ్‌భవన్‌లో వున్న ఉద్యోగుల సంక్షేమం చూడవలసిన బాధ్యత కూడా ఆమెదే!

వివిధ విషయాలమీద రోజూ ఎన్నో వినతి పత్రాలు వస్తూవుంటాయి; ఎందరో ప్రతినిధులు తమతమ సమస్యలను వివరించడానికి వస్తూ వుంటాడు. వీరందరితోనూ మాట్లాడుతూ, వారి సమస్యలను అర్థం చేసుకుంటూ, గవర్నర్‌తో సంప్రతిస్తూ, తీసుకోవలసిన చర్యల గురించి వివిధ ప్రభుత్వ శాఖలకూ తెలియజేస్తూ వుంటారు–చంద్రకాంతి ఘర్యాలి.

తన వివాహ విషయమూ తమిళనాడు విషయమూ చెబుతూ ఆమె–"నేను కాశ్మీర్ ప్రాంతపు స్త్రీనైనా ఇక్కడ వుండడం, పనిచెయ్యడం నిజంగా నాకెంతో ఆనందంగా వుంది. నా భర్త వేపువారు కూడా ఇక్కడ వుండడంతో నాకెంతో సదుపాయంగా వుంది. ఉద్యోగ నిర్వహణలో నేను బయట తిరుగుతున్నప్పుడు, నాబిడ్డ బాగోగులను వారే చూసుకుంటున్నారు. నాకు ఎవరితోనూ ఎలాంటి సమస్యలూ ఉత్పన్నం కావు. కుటుంబ సభ్యులతోనూ అంతే! నాకు కొంత ఆధ్యాత్మిక చింతా, వేదాంతం మీద విశ్వాసమూ వున్నాయి. అవతలి వారితో మనం 'అడ్జెస్ట్' కాగలిగితే, ఎవరి జీవితమైనా, హాయిగానే వుంటుంది. ఆ 'అనుకూలత' లేనప్పుడు, అన్నీ ప్రతిబంధకాలుగానే కనిపిస్తాయి. మరి, 'అడ్జెస్ట్' కాగలిగినప్పుడు–స్థలం, భాష, వాతావరణం, ఏదీ అడ్డురాదు!" అన్నారు ఘర్యాలి.

—కమలాకుమార్

Interpub/G SC/2/76-R-Tel

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు.




చమట వలన గలిగే శరీర
దుర్గంధాన్నుండి శక్తివంతంగా
కాపాడుతోంది.
ఏ సబ్బు పూర్తిగా వుంచనంత
తాజాగా మిమ్ములను
వుంచుతుంది.

**సౌందర్య రక్షణకై చర్మ రోగ నిపుణులచే సిఫారసు చేయబడింది.**

# వైద్య సలహాలు



-డాక్టర్

కుమారి రా.

నాకు పదిహేడేళ్ళు. ఋతుస్రావం ఐదారు మాసాలకొకసారి అవుతున్నది. ఈ సమస్య గురించి డాక్టర్‌ను సంప్రతించాను. ఆమె ఇచ్చిన మాత్రలు తీసుకున్నాను. కాని నా పరిస్థితిలో మార్పు లేదు. కొన్నిసార్లు రక్తస్రావం ప్రారంభమై, నాలుగైదు మాసాలబాటు ఆ బాధ ఉంటున్నది. అప్పట్లో భరించరానంత కడుపునొప్పి కూడా ఉంటుంది. ఈ సమస్యల నుంచి నేను బయటపడి ఆరోగ్యంగా ఉండడానికి మార్గం లేదా?

సమర్త అయిన తర్వాత మొదటి రెండు మూడేళ్ళు ఋతుస్రావం అటూ ఇటూ కావచ్చును. రక్తస్రావం ఎక్కువగా ఉండి, అది చాలా రోజులబాటు ఉంటే రక్తహీనత ఏర్పడవచ్చును. అందువల్ల పోషక పదార్థాలున్న సత్తువగల ఆహారాన్ని తీసుకోవాలి. బహుశా మీ గర్భాశయం బలహీనంగా ఉందేమో! మీ లేడీ డాక్టర్‌ను సంప్రతించి ఆమె ఇచ్చే మందులను వాడండి. అవసరమైతే ఆమె మీ రక్తవృద్ధికి అవసరమైన మందులు కూడా ఇవ్వవచ్చును.

కుమారి సా.

నేను 24 సంవత్సరాల వయసులో ఉన్నప్పటి నుంచీ–అంటే గడచిన రెండేళ్ళ నుంచీ నాకు దృష్టిలోపం ఏర్పడింది. డాక్టర్ కళ్ళకు అద్దాలు వాడాలన్నారు. కాని నాకు అద్దాలు వేసుకోవడమంటే అసహ్యం. పోషకాహారం తింటే కళ్ళు ఇకముందు బలహీనపడే అవకాశం ఉండదని నా అభిప్రాయం. మీరేమంటారు?

కళ్ళకు అద్దాలు వేసుకోవడం అసహ్యం అనుకుంటే ఎలా? డాక్టర్ సలహా పాటించకపోతే మీ దృష్టి మరింత మందగించి కళ్ళు కనబడకుండా పోయే ప్రమాదం ఏర్పడవచ్చును. అప్పుడు మీరేం చెయ్యగలరు? కళ్ళలోని లోపాన్ని సరిచెయ్యడానికి అద్దాలు వేసుకోక తప్పదు. అందుకు పోషకాహారం ఒక్కటే చాలదు.

శ్రీమతి ఎమ్.

మాది మధ్యతరగతి కుటుంబం. నా వయసు 22 సంవత్సరాలు. నాకు పెళ్ళయింది. రెండేళ్ళ పాపాయి ఉంది. బట్టలు ఉతకడం, పాత్రలు తోమడం వంటి పనులు – అంటే ప్రధానంగా నీటితో ప్రమేయం ఉన్న పనులు చేస్తే నాకు వెంటనే తుమ్ములు రావడం ప్రారంభమవుతుంది. ఊపిరి సరిగా ఆడదు. రెండు మూడు రోజులబాటు ముక్కు నుంచి నీరు కారుతూ ఉంటుంది. ఆ తర్వాత ఊపిరి పీల్చడానికి వీలుకానంతగా శ్లేష్మం కమ్మేస్తూ ఉంటుంది. ఇలా ఒక ఏడాది నుంచి అవస్థపడుతున్నాను. ఏదన్నా తింటే వాంతులు అవుతున్నాయి. డాక్టర్ నాకు ఆస్మా (ఉబ్బసం) ఉందని ఇంజక్షన్ చేసి, మాత్రలు తీసుకోమన్నారు. 'ఈ జబ్బును పూర్తిగా నయం చెయ్యడానికి సాధ్యం కాదు. కనుక ఎడతెరపిలేకుండా మందులు తీసుకుంటూ ఉండాలి' అని డాక్టర్ చెప్పారు. ఇది ఇలా ఉండగా నేను మళ్ళీ గర్భవతిని. నా జబ్బు పుట్టబోయే పాపాయికి సోకుతుందేమోనని భయపడుతున్నాను....

ఉబ్బసాన్ని పూర్తిగా నయం చెయ్యడం సాధ్యం కాదు. మీకు దుమ్ము వల్ల 'అలెర్జీ' కలుగుతుందనుకుంటాను. కనుక మీకు దుమ్ము సోకకుండా చూసుకోవడం అవసరం. ఉబ్బసం రాకుండా ముందే జాగ్రత్తగా ఉండదలచుకున్నవారు–తీపి పదార్థాలు ఎక్కువగా తినకూడదు. కొందరికి ఆహారంలో పులుపు ఎక్కువయితే (పుల్లని ఆహార పదార్థాలు కాస్త ఎక్కువగా తీసుకుంటే) ఉబ్బసం రావచ్చును. అందువల్ల మీకు ఏయే పదార్థాలవల్ల ఉబ్బసం వస్తున్నదో తెలుసుకుని వాటిని విసర్జించాలి. డాక్టర్ ఇచ్చిన మందులు సక్రమంగా తీసుకోవాలి. ఇక మీ గర్భధారణ విషయం–లేడీ డాక్టర్ దగ్గరికి వెళ్ళి మీరు వెంటనే పరీక్ష చేయించుకుంటే మంచిది. ఇలా చేస్తే ప్రసవకాలంలో మీకు ఏ ఇబ్బందీ రాదు.

# వానలు-పడిసెం

'పడిసెం, ప్రేమ గుప్తంగా వుండటం కష్టం' అంటుంది ఒక ఇంగ్లీష్ సామెత। అందులో వర్షాకాలొచ్చాయంటే పడిసాన్ని ఆపడం కష్టం. పడిసెంతో బాధపడే వారికి ఎక్కువ శ్రమ లేకుండా, ఇంట్లో మామూలుగా వాడే వస్తువులతో ఉపశమనం పొందడానికి కొన్ని చిట్కాలు వున్నాయి.

1. పడిసెం ప్రారంభ దశలో ముక్కుపుటాలలో ఒక నూనె బొట్టు వేసుకుంటే ఉపశమనంగా వుంటుంది.

2. పడిసెం మూలంగా భారంగా వుంటే మరుగుతున్న నీళ్ళలో చిటికెడు పసుపు వేసి, దుప్పటి కప్పుకొని ఆ ఆవిరి పీలిస్తే శరీరం తేలికగా వుంటుంది.

3. పడిసెం మూలంగా ముక్కు దిబ్బడేస్తే ఒక మిరియం గింజకానీ, లవంగంకానీ కాల్చి (పిన్నుకు గుచ్చి) ఆ పొగను ముక్కు దగ్గర పెట్టుకొని వాసన చూస్తే తగ్గుతుంది.

4. పడిసెం మూలంగా బాధ పడేవారు వాము కొద్దిగా మాడ్చి, గుడ్డలో కట్టుకొని వాసన చూస్తే వెంటనే తగ్గుతుంది.

5. పడిసెం పట్టే సూచనలు కనపడితే ఏం చెయ్యాలి? మిరియాల పొడి కలిపిన పాలు రెండు మూడుసార్లు తాగితే పడిసెం పట్టకుండా వుంటుంది.

6. పసుపు, సాంబ్రాణి, వాము నిప్పు మీద వేసి పొగ పీల్చినా, పడిసానికి హాయిగా వుంటుంది.

7. మిరియం అరగ దీసి ముక్కుమీద పట్టు వేసి, సాంబ్రాణి పొగ పీల్చితే, దిబ్బడేసిన ముక్కు వెంటనే మామూలుగా అవుతుంది.

8. నల్ల జీలకర్ర, ములగ చెక్క సంపాదించి నలిపి గుడ్డలో వేసి పీల్చినా కూడా పడిసెం వెంటనే తగ్గుతుంది.

9. పసి పిల్లలకు పడిసెం పడితే .. .. మీద తమలపాకు వేసి, గుడ్డ వేడిచేసి కాచాలి.

10. మిరియాలు, కరక్కాయ, అక్కలకర్ర, దుంపరాష్ట్రం, కళింగరాష్ట్రం, దుంపకొమ్ము, జీలకర్ర, ధనియాలు, వాము వేసి నీళ్ళలో మరగపెట్టి ఆ కషాయం తాగితే, పడిసెం పిసరంతైనా కనపడదు.

—యస్. టి. అరుణ

# పండుగలకు పట్టు చీరలు

'పట్టు చీరలు కట్టుకోవాలంటే బాగానే ఉంటుంది కానీ వాటి ధరలు తలుచుకుంటే మాత్రం చాలా భయంగా ఉంటుంది' అని చాలా మంది వనితలు నిస్పృహ చెందుతూ ఉంటారు. అటువంటి వారి నిస్పృహను కొంతవరకైనా తగ్గించడం కోసం ఈ దీపావళికి ప్రత్యేకంగా 'జనతా పట్టు చీరలు' రూపొందించారు–కాంచీపురానికి చెందిన నల్లి వీవింగ్ సెంటర్ వారు. ఈ జనతా పట్టు చీరల ధరలు నూట డెబ్బైఐదు రూపాయల నుంచి మూడు వందల రూపాయల లోపుగానే ఉంటాయని వారన్నారు. 'ధర తక్కువగా ఉన్నా వాటి మన్నికకు మాత్రం ఏ లోటూ రాదు' అంటారు వాళ్ళు. జనతా చీరలే కాక వారు ఈ దీపావళికి 'లక్షదీపం', 'నక్షత్రాల ముగ్గు' వంటి ప్రత్యేకమైన పట్టు చీరలు, 'స్క్వేయర్ టైప్' గళ్ళ పట్టు చీరలు మొదలైనవి కూడా రూపొందించారు. వాటి స్థాయిని బట్టి వాటి ధరలు–ఐదువందల రూపాయల నుంచి వెయ్యి రూపాయలు దాకా ఉన్నాయి. ఇక్కడి వర్ణ చిత్రాలలో కనిపించే ఈ చీరలు–కంచిలోని నల్లి వీవింగ్ సెంటర్‌లోనే కాక మద్రాసులోని నల్లి వారి షాపులలోనూ లభిస్తాయి.

వర్ణచిత్రాలు : సత్యకుమార్





# వయసెంత?

-కె. ఇందిర



ఒక ఆదివారం సాయంత్రం ప్రొఫెసర్ జి. జి. శాస్త్రి అనబడే ఘంటసాల గణితశాస్త్రి ఈజీ చైర్‌లో కూర్చుని నవల చదువుతున్నాడు. శాస్త్రి ధర్మపత్ని సంగీతంలో ఎమ్. ఎ. వంటింట్లో వసంత రాగాన్ని ఆలపిస్తూ పత్రికలో వచ్చిన వంటకాల మీద ప్రయోగం చేస్తోంది.

కూతురు సుగాత్రి డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చొని లతామంగేష్కర్ పాడిన పాటను ఖూనీచేస్తూ, పోనీటెయిల్ కట్టుకుంటోంది. కొడుకు గామా రెండు రెండ్లు నాలుగయినప్పుడు, నాలుగు నాలుగులు ఎనిమిది ఎందుకవకూడదు ? – అనుకుంటూ లెక్కలతో కుస్తీ పడుతున్నాడు.

" ఈ లెక్క చెప్పండి నాన్నగారూ. ఒక స్త్రీ ఒక పనిని రెండు గంటల్లో చేస్తే, అదే పనిని నలుగురు స్త్రీలు ఎంత సేపట్లో చేస్తారు ?"

" అంత మాత్రం తెలియదురా పిచ్చి గామా. నాల్గు గంటల్లో చేస్తారు!"

"లెక్కల ప్రొఫెసర్‌గారూ! పప్పులో కాలేశారు. నలుగురు కలిస్తే అరగంటలో చేస్తారు." గులాబ్‌జామ్‌లు, చేగోడీల ప్లేట్లు టేబుల్ మీద పెడుతూ నవ్వుతూ అంది సంగీత.

" కరెక్ట్ బేబీ! నీ ఆన్సర్ పురుషులకి వర్తిస్తుంది. కాని ఈ లెక్కలో వుంది–స్త్రీలు. ఒక స్త్రీ వుంటే నోరు వూరుకుంటుంది చేతులు పనిచేస్తాయి. కాని నలుగురు స్త్రీలు కలిస్తే చేతులు వూరుకుంటాయి. నోళ్ళు పని చేస్తుంటాయి. అప్పుడు తొందగా పని ఎలా తెములుతుందే డియర్ ప్రెట్టీ...."

" ఆ నవల్స్ చదివి నన్ను బేబీ, గీబీ, ప్రెటీ గిట్టీ అని పిలవకండి. అసలే వాడు లెక్కల్లో మొద్దు. ఇలా తప్పు ఆన్సర్లు చెప్పి వాడి బుర్ర పాడు చెయ్యకండి. అయినా నే నెప్పుడో చెప్పాను, ఏరాముడో, కృష్ణుడో అని వాడికి పేరు పెట్టకుందామండీ అని. అల్ఫా, బీటా, తీటా, గామా అంటూ ఆపేరు పెట్టారు వాడికి. పేరు గొప్ప–వూరు దిబ్బలాగా అయింది పరిస్థితి."

"ఏం చెయ్యను బేబీ, ఈ ప్రాబ్లమ్ ఇలా కాంప్లికేట్ అవుతుందని అనుకోలేదు. మా నాన్న లెక్కల మాష్టారు. నన్ను లెక్కల ప్రొఫెసర్‌గా చేసారు. నేను గామాగాన్ని కంప్యూటర్‌కి పోటీగా నిల బెడదామనుకున్నాను. కాని వాడు ఎప్పుడూ రెండు రెండ్లు నాలుగు, నాలుగు, నాలుగులు ఎనిమిది అంటాడు. అదిసరే కాని బేబీ, నీ విషయంలో ఏమయింది ? నా కూతురు లతామంగేష్కర్ అంత తియ్యగా పాడాలని దానికి సుగాత్రి అని పేరు పెట్టావు. కాని అది గార్ధభేశ్వరి అయింది. దీనికేమంటావు ?"

" మీ పోలికే వచ్చింది దానికి. మీ ఇంటి పేరు ఘంటసాల వారు. మీరు ఎంతో చక్కగా పాడుతారు కాబోలు–ఎంచక్కా సినిమాల్లోలాగా బృందావన్ గార్డెన్‌లో, పార్కుల్లో కాకపోయినా, వంట ఇంట్లోనైనా డ్యూయెట్లు పాడుకోవచ్చును కదా అని మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నాను. కాని రామ, రామ–మీ గొంతే వచ్చింది దానికి. ఏం చేస్తాను – అంతా నా కర్మ" అంటూ ముక్కు ఎగబీల్చి, కళ్ళు తుడుచుకుంది.

" అమ్మడూ సంగీతా, ఏం చేస్తున్నావే తల్లీ ?" అంటూ వచ్చింది పక్కయింటి పిన్నిగారు.

" బేబీ, గులాబ్‌జామ్ ఘమ ఘమలు సోకి వచ్చింది మీ పిన్నిగారు. ఆవిడకి నైవేద్యం పెట్టేసి తొందరగా పంపించేసేయి. మనిద్దరం ఎంచక్కా లవ్ గేమ్ ఆడుకుందాము. ఆదివారం మళ్ళీ వారానికిగాని రాదుగా?"

" చాల్లెండి, సిగ్గు లేకపోతే సరి. లవ్ గేమ్‌ట, లవ్ గేమ్. నలభై ఏళ్ళు దాటాయి ఇంకా బుద్ధి రాలేదు." మూతి మూడు వంకలు తిప్పుతూ వెళ్ళింది సంగీత.

" పిన్నిగారూ! గులాబ్‌జామ్‌లు చేశాను. తిని ఎలాగున్నాయో చెప్పండి."

ఆ గదిలోంచి వస్తున్న శబ్దతరంగాలు గణిత శాస్త్రి కర్ణభేరిని చొచ్చుకుని పోయాయి.

నవలను ప్రక్కన పెట్టేసి, వాళ్ళ సంభాషణ వినసాగాడు. ఆడవాళ్ళ ముచ్చట్లు వింటుంటే భారతం కూడా వినబుద్ధవదు, ఇక ఈ నవల ఒక లెఖ్ఖా! గులాబ్‌జామ్‌లు తింటూ వినసాగాడు.

"చాలా బాగున్నాయి సంగీతా, ఎలా చేశావ్? మా కోడలు పిల్లకు కాస్త చెప్పు తల్లీ. అన్నట్లు ఈ మాట నిజమేనా, నీతోపాటు ఆడపిల్లల కాలేజీలో ఏదో ఆలజీ లెక్చరర్‌గా చేస్తోందే విమల, దానికి పెళ్ళట కదూ, అయినా ముప్పై ఏళ్ళు దాటాక ఇంకా పెళ్ళేమిటీ? మా కాలంలో మేము ముప్పై ఏళ్ళకే అమ్మమ్మలయ్యాము."

"మీ కాలం ఎందుకండీ, నాకు మటుకు నాకు పదహారేళ్ళకే పెళ్ళయింది. విమల నా ఈడుదే, నాకప్పుడే పధ్నాలుగేళ్ళ కూతురుంది."

"అమ్మాయి సంగీతా! ఇంకొక్క మాట. ఎవరితో చెప్పబాకేం! పెళ్ళికొడుకు దానికంటే ఆరునెలలు చిన్నవాట్ట. హయ్యో రామ వరహీనం ఎంత తప్పు? మీ బాబాయిగార్కి, నాకు పద్దెనిమిదేళ్ళు తేడా వుంది తెలుసా?"

గణితశాస్త్రి చెవులు నిక్కబొడుచుకున్నాయి.

"నిజమా పిన్నిగారూ, ఎంత విడ్డూరం! మీ అల్లుడుగార్కి నాకూ పదేళ్ళు తేడావుంది. అయినా మనకెందుకులెండి వాళ్ళ గొడవ. అన్నట్లు పిన్నిగారూ మీ స్వరాజ్యానికి ఏమైనా సంబంధాలు చూస్తున్నారా?"

"దానికిప్పుడేం తొందరే సంగీతా, ఇంకా రెండు పదులు దాటందే! సరేగాని నేవెళ్ళొస్తాను. వీలుంటే మా కోడలికి గులాబ్‌జాములు చెయ్యడం చెప్పు. వస్తానమ్మా." పిన్నిగారి భారీకాయం గుమ్మం దాటగానే, బుగ్గలు నొక్కుకుంటూ గణితశాస్త్రి దగ్గిరకు వచ్చింది సంగీత.

"ఈ విడ్డూరం విన్నారాండీ, మన ఇండియాకి స్వరాజ్యం వచ్చిన రోజునే పుట్టిందట — అందుకని స్వరాజ్యలక్ష్మి అని పేరు పెట్టారట. మనకి స్వ రా జ్య మొ చ్చి ముప్పైఏళ్ళయింది. కాని ఆ స్వరాజ్యానికింకా ఇరవైఏళ్ళు నిండలేదట. ఇంకానయం—పదేళ్ళ చిన్నబొప్పి అని చెప్పలేదు" మూతి మూడు వంకలుగా తిప్పింది సంగీత.

"ఆలెక్క తరువాత క్యాలుక్‌లేట్ చేద్దాం గాని బేబీ, నీకూ నాకూ నిజంగా పదేళ్ళు తేడావుంది? అలాగయితే పదిహేడేళ్ళకే ఎమ్. ఎ చదివి లెక్చరర్‌గా ఎలా పనిచేస్తున్నావబ్బా. ఈలెక్క సరిగ్గా రాదే! అయినా పెళ్ళప్పుడు నీకూ నాకూ మూడేళ్ళు తేడా అని గుర్తు. ఇప్పుడు పదేళ్ళు ఎలా అయిందబ్బా?" బట్టతల నిమురుకుంటూ గొణిగాడు జి. జి. శాస్త్రి.

"మీ లెక్కలు సరే, నా బ్రతుకూసరే. ఆడవాళ్ళ వయస్సుకు మైనస్‌లేగాని ప్లస్‌లు చేర్చకూడదండీ మీకు తెలీదేమో! మీరు ఆ లెక్కల వివరాలు చూసుకోండి. నేవెళ్ళి విమల పెళ్ళి వివరాలు కనుక్కుంటాను."

సంగీత వెళ్ళినవైపే చూస్తూ "ఔరా! ఆడవాళ్ళ మాటలకి అర్థాలే వేరులే అని ఎవరన్నారో గాని, సెంట్ పర్సెంట్ కరెక్ట్. మైనస్‌లే కాని ప్లస్‌లే లేవుట. ఆడదే ఒక ప్లస్. బ్రహ్మచారి జీవితం ఒక మైనస్. వాడికున్న బరువు బాధ్యతలు జీరో. పెళ్ళనే ప్రాబ్లమ్‌లో మైనస్‌కి ప్లస్‌ను చేరుస్తారు. అప్పుడా ఈక్వేషన్ ఎంత పెద్దదయింది!

బ్రహ్మచారి + భామామణి = సంసారం + సంతోషం = సంతానం + ఖర్చులు + ఆడంబరాలు + అప్పులు + చదువులు సంధ్యలు + పెళ్ళిళ్ళు + కట్నాలు = అల్లుళ్ళు + కోడళ్ళు + మనుమళ్ళు + మనుమరాళ్ళు + మునిమనుమళ్ళు + మునిమనుమరాళ్ళు.

ఓ మైగాడ్, ఇలా ఇన్ని ప్లస్‌లు చేరిగదా, జనాభా ఇలా పెరిగిపోతోంది. ప్రపంచ జనాభాకి ఇన్ని ప్లస్‌లు చేరుస్తున్న వనిత, వయసులో మాత్రం మైనస్ అంటుందేం?

సత్యహరిశ్చంద్రా, నువ్వు ఆడదానిగా పుట్టివుంటే నీకా పేరు వచ్చి వుండేదే కాదయ్యా. వయసు విషయంలో పచ్చి అబద్ధం ఆడేసేవాడివి. ఓ పురుషపుంగవా! నువ్వు చంద్రమండలానికి వెళ్ళావు, అంగారక గ్రహంలో ప్రాణికై వెతుకుతున్నావు. కాని ఆడదాని వయస్సును చెప్పే యంత్రం కనిపెట్టలేక పోతున్నావు. ఇది గణితశాస్త్రానికే అవమానం." గణితశాస్త్రి డ్రామాలో లాగా ఒక పోజ్ ఇచ్చాడు.

"ఒరేయ్ గణితశాస్త్రీ, నువ్వు ఆ యంత్రం కనిపెట్టి పేరు సార్థకం చేసుకో" మనసు చెప్పిన మాటలను పాటించడానికి నిశ్చయించు కున్నాడు ప్రొఫెసర్ జి. జి. శాస్త్రి.

*

"బేబీ, సక్సెస్, గ్రాండ్‌సక్సెస్, ప్యాకెట్ క్యాలుక్‌లేటర్‌ని కనిపెట్టేశాను." సినిమాల్లోలాగా భార్యను పైకిఎత్తి, సర్కస్‌లో లాగే ఒక ఫీట్ చేద్దామనుకున్నాడు కాని, ఆ భారాన్ని, తన భారం మోయడానికి ప్రయత్నిస్తే ప్రమాదమని వూరుకున్నాడు. ఆ సంతోషాన్ని వ్యక్తం చెయ్యడానికి సంగీతను కేంద్రంగా పెట్టి, తను చుట్టూరా తిరుగుతూ వృత్తం గీసేశాడు గణితశాస్త్రి.

"ఇదేమిటండీ, గిన్నె గిరగిర, చెమ్మచెక్క ఆడతానంటారు? చేతులు వదలండి. ఇంతకీ అది దేన్ని క్యాలుకలేట్ చేస్తుంది. బ్లాక్‌మనీనా?" కందిపోయిన చేతులను చూసుకుంటూ అంది సంగీత.

"వయస్సుని. వున్నదున్నట్లే క్యాలుకలేట్ చేస్తుంది. త్వరలోనే మార్కెట్‌లో పెట్టబోతున్నాను." గర్వంగా అన్నాడు గణితశాస్త్రి.

"ఏడిసినట్లే వుంది. వయస్సును కనుక్కుంటే ఏం గొప్పండీ. ఇంకేదైనా అయివుంటే సంతోషించేదాన్ని." విసురుగా వెళుతున్న సంగీతను చూస్తూ నీరుకారి కుర్చీలో కూలబడ్డాడు గణితశాస్త్రి.

మార్కెట్‌లో ఆ ప్యాకెట్ క్యాలుక్‌లేటర్స్ హాట్‌కేక్స్‌లాగా అమ్ముడు పోతున్నాయి. ఖరీదు తక్కువ. విలువ ఎక్కువ. ఆఫీసుల్లోనూ, హాస్పటల్స్‌లోనూ, మార్కెట్‌లోను, మహిళా మండలులలోనూ, కాలేజీల్లో, స్కూళ్ళల్లో ఎక్కడ చూసినా క్యాలుక్‌లేటర్లే. ముఖ్యంగా పెళ్ళికొడుకులకు, ప్రెస్ రిపోర్టర్‌లకు క్యాలుక్‌లేటర్ బాగా పనికి వచ్చింది. ఎలక్షన్ టైములో వోటర్ల లెక్కకు క్యాలుక్లేటర్ గాబా సహాయం చేసింది.

ఒక ఇంట్లో పెళ్ళివారు వచ్చి పెళ్ళికూతురును చూశారు. జరగవలసిన తంతు అంతా అయింది. ఫలహారాలు బాగా పట్టించారు మగ పెళ్ళివారు.

"బావగారూ పిల్ల నచ్చిందండీ. మీరు ఇచ్చిన జాతకం ప్రకారం మీ అమ్మాయికి పందొమ్మిదేళ్ళని వుంది. మరి ఈ క్యాలుక్లేటర్ ఏమి చెపుతుందో చూద్దామా? ఏమ్మా, రమా, రామ్మా. ఈబటన్ నొక్కమ్మా. చాలమ్మా."

వయస్సు ఇరవైనాలుగని చెప్పింది. క్యాలుక్‌లేటర్.

"చూడండీ బావగారూ మావాడి వయసు ఇరవైనాలుగు, మీ అమ్మాయి వయసు ఇరవైనాలుగు. అంటే వరహీనం అవుతుంది. మేము వేరే సంబంధం చూసుకుంటాము. మీకు శ్రమ ఇచ్చాము. క్షమించండి."

క్యాలుక్లేటర్‌ను, ఖాళీ ప్లేట్లను చూసి పళ్ళ

ఫ్యాషన్ మోడల్‌ని అడగండి

# ఏం చెబుతుందో మరి వినండి.

"ఆరు రంగులూ ఒకే
దానిలోగల శింగార్
కుమ్‌కుమ్‌కన్నా మించినది
లేదు. నేను వేసుకునే బట్టలకీ
వాటికీ సరిగ్గా సరిపోయేలా,
6 వేర్వేరు రంగుల్లో...క్షణం తీరిక
లేని నాకు యిది బలే వీలు!"

ఆరు రంగులూ ఒకే దానిలో గల
శింగార్‌లో, మీరెప్పుడూ పొందే
ఆ స్థిరమైన శింగార్ నాణ్యత
మీకు లభిస్తుంది.



## శింగార్

భారతదేశంలో అన్నిటికన్నా అందమైనదీ,
అన్నిటికన్నా ఎక్కువగా అమ్ముడయ్యే
కుంకుమ బొట్టు.

పారమౌంట్ ప్రోడక్ట్స్, బొంబాయి-400 004.

everest/1054/SH-Tel



విజయనగరంలోని జేసీరెట్స్‌వారు ఈమధ్య—ప్రభుత్వ మహారాణి ఆసుపత్రిలోని శిశువులకు పాల సీసాలు, రోగులకు పళ్ళు బహూకరించారు. జేసీరెట్స్ అధ్యక్షురాలు శ్రీమతి పి. సన్యాసమ్మరాజు, తమ సంస్థ కార్యక్రమాలను గురించి వివరించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న ఆసుపత్రి ముఖ్య వైద్యురాలు శ్రీమతి అహల్య—జేసీరెట్స్ చేస్తున్న సేవలను అభినందించారు.

పటపటలాడించాడు తండ్రి. నూరు అబద్ధాలాడైనా ఒక ఇల్లు నిలబెట్టమన్నారు కదా అని వయస్సు అబద్ధం చెప్పి దొంగ జాతకాలు సృష్టించి ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేసే తండ్రులను దెబ్బతీసింది క్యాలుక్లేటర్.

*

చిత్రపత్రిక రిపోర్టర్, సినీతార సితారా ఇంటర్‌వ్యూ జరపడానికి ఆమె భవనానికి వచ్చాడు. స్విమ్మింగ్‌పూల్ నుంచి జలకన్యలాగా వస్తున్న ఆమెను తన కెమెరాలోకి లాక్కున్నాడు రిపోర్టర్. లోపలికివెళ్ళి చీర కట్టుకొని మేకప్ చేసుకుని వచ్చింది సితారా. ఈలోపున రిపోర్టర్ ఆమె పెంచే కుక్కల్ని, పిల్లుల్ని, పిట్టల్ని, పువ్వుల్ని కలిపి ఫోటో తీసేశాడు. భవనంలోకి వెళ్ళి ఖరీదైన ఫర్నిచర్‌ని, పనిమనిషి ఎల్లమ్మ అనబడే ఆమె అక్కయ్యనూ ఫోటో తీశాడు.

"మిస్ తారా! మీరు సినీరంగంలో ప్రవేశించి ఎన్ని సంవత్సరాలయింది?"

"పది సంవత్సరాలండీ." పొడుగాటి గోళ్ళకు వేసిన పాలిష్‌ను చూసుకుంటూ అంది ఆమె.

"మరి జీవితరంగంలోకి ప్రవేశించి ఎన్నేళ్ళయిందంటారు?"

"పద్దెనిమిది ఏళ్ళు అయిందండీ" ముంగురులను అలవోకగా సర్దుకుంటూ చిరునవ్వుతో అంది.

"మీలో ఇంత గ్లామర్ పెరగడానికి మీరేం చేస్తారు? మీ హాబీస్ ఏమిటి? మీ హైట్, వెయిట్ చెపుతారా శ్రమ తీసుకోకుండా."

"దానికేముందండీ. ప్రొద్దుటే కాఫీలాంటి పానీయాలు త్రాగను. నిమ్మరసం త్రాగుతాను. తీపి పదార్థాలు, ఐస్‌క్రీంలులాంటి లావుని పెంచే పదార్థాలు తినను. సబ్బు వాడను, సున్ని పిండి వాడుతాను. నా హాబీసంటారా? తోటపని చెయ్యడం, తీరిక సమయాల్లో వంట చెయ్యడం, తోటి కళాకారులతో సరదాగా కాలం గడపటం—ఇవే నా హాబీలు. నా హైట్ అయిదడుగుల నాలుగంగుళాలు, బరువు నూట పది పౌన్లు. ఇక నా వయసు...." ఆమె మాటలను అర్ధాంతరంగా ఆపాడు రిపోర్టర్.

"మీ కా శ్రమ అక్కరలేదు తారగారూ. ఈ బటన్ నొక్కండి చాలు. ఆఁ చాలు... చిత్ర పత్రికలో విరిసే పుష్పంగా ప్రచురించబోతున్నాము మీ గురించి. నవ్వులు పువ్వులు చిందుతూ ఒక పోజ్ యివ్వండి. ఆఁ ఓ. కె. చాలా థ్యాంక్స్. నమస్తే వస్తానండీ."

నెల రోజుల తరువాత తన ముఖచిత్రంతో వెలువడిన చిత్ర పత్రిక చూస్తూ చిరునవ్వు చిందిస్తోంది సితార. ఆమె చెప్పిన విషయాలన్నీ వున్నాయి దానిలో. వయసు మాత్రం పాతిక సంవత్సరాలని వుంది. ఆయిదారు సంవత్సరాలుగా 'టీన్ ఏజ్ గ్లామర్ తార'గా వెలుగొందుతున్న సితారా అనబడే మల్లమ్మకు తన నిజమైన వయస్సును చూడగానే గ్లామర్ ఒక్కసారిగా తగ్గిపోయింది. గ్లామర్ కోసం వయసు తక్కువ' చెప్పుకునే తారలకు క్యాలుక్‌లేటర్ కంటక ప్రాయమయింది.

*

ఎలక్షన్లు వస్తున్నాయి. ఒక పల్లెటూరులోని పంతులుగారు ఇంటింటికి వెళ్ళి వోటర్లజాబితా తయారు చేస్తున్నారు. ఒక ఇంటి ముందు ఆడపిల్లలంతా చేరి అష్టాచెమ్మా ఆడుకుంటున్నారు. పంతులుగార్ని చూసిన సుబ్బులు లేచి తల్లిని పిలిచింది.

"అమ్మోయ్. పంతులుగారొచ్చారు, పంతులుగారండీ వోట్లకేనా మీరొచ్చింది. మా ఇంట్లో అమ్మ, నాన్న, నేను — ముగ్గురం వున్నాము వోటు వేసేటందుకు."

"రండి పంతులుగారు రండి. ఒసేవ్ సుబ్బులూ నువ్వు పంతులుగారికి కాస్త కాఫీ పెట్టు." కూతుర్ని వంటింట్లోకి పంపి వెనకాలే వెళ్ళింది సుందరమ్మ.

"ఒసేవ్ సుబ్బులూ, నీకు సిగ్గులేదటే. ఓటు వేస్తావా—ఓటు. ఓటు వెయ్యడానికి వెళ్ళితే అందరూ నిన్ను చూస్తే ఏమనుకుంటారు? ఇరవై ఒక్క ఏళ్ళు దాటాయనుకుంటారు. నేనేమో పద్దెనిమిది అని అందర్కీ చెప్తుండా. సాల్లే సింగాడం." మొట్టింది సుందరమ్మ.

"అమ్మా, నిజంగా నాకు ఇరవైఒకటి నిండాయికదే. ఎంచక్కా మల్లయ్యగారు పంపిన కారులో అక్కడికి పోయి, వాళ్ళిచ్చిన కాఫీలు తాగి ఓటు వేసి, వేలికి బొట్టు పెట్టించుకొని మళ్ళీ కాఫీలు తాగి మ్యాటినీ సినిమాకి పోయి ఇంటికి రావొచ్చును. అమ్మా నేను ఓటు వెయ్యవద్దా?"

"నోరు మూసుకుని వెళ్ళి కాఫీ ఇచ్చిరా పంతులుగారికి. నీకంటే పెద్దది ఎల్లయ్యగా రమ్మాయి–ఓటు వెయ్యడానికి రాదుట తెలుసా. నువ్వు ఒక్కదానివే ఓటు వెయ్యకపోతే కొంప లేమీ అంటుకోవు. మళ్ళీ ఆ వూసెత్తకు." కూతురు వెనకాలే వెళ్ళింది సుందరమ్మ.

"పంతులుగారూ అమ్మాయికి ఇంకా పందొమ్మిదేనండీ. ఓటు వెయ్యాలని వుందిట."

"అక్కయ్యగారూ, అమ్మాయి వయసు మీరు చెప్పక్కర్లేదు. ఈ క్యాలుక్‌లేటర్ చెపుతుంది. సుబ్బులూ ఈ బటన్ నొక్కమ్మా చాలు. ఆ. చూడండీ సుందరమ్మగారూ, మీ సుబ్బులు వయసు ఇరవై రెండని చెపుతోంది. అందుకని ఓటు వెయ్యోచ్చండీ. చూడండీ అక్కయ్యగారూ మన కాలం అయిపోతోంది. భవిష్యత్తు వాళ్ళది. వాళ్ళ నాయకుల్ని వాళ్ళే ఎన్నుకోవాలండీ. వయసు ఎక్కడ బయటపడిపోతుందో అని అమూల్యమైన ఓటు హక్కును జారవిడుచుకుంటే ఎలాగండీ. అందరి తల్లులూ ఇలా చేస్తే మన ప్రజాస్వామ్యం ఎలా నిలుస్తుందండీ. సుబ్బులూ! నువ్వు ధైర్యంగా వెళ్ళి ఓటు వెయ్యి తల్లీ. వెళ్ళొస్తానండీ అక్కయ్యగారూ."

"ఓరి నీ తల్లి కడుపు బంగారం కాను. అక్కయ్యట. అక్కయ్య. నాకంటె పెద్దవాడివి. ఏమిటబ్బా! ఆ పెట్టె క్షణంలో సుబ్బులు వయస్సు చెప్పింది. ఇంకానయం నేను నొక్కానుకాదు ఆ బటన్. నా సామిరంగా ఆ పెట్టె ఎల్లయ్య గారి కూతురు వయసు చెప్పాలా, దాని బండారం బయటపడాలా! పాతికేళ్ళు వచ్చాయి. సుబ్బులు కంటే చిన్నదిట–చిన్నది" వంటింట్లోకి వెళ్ళి మిగిలిన కాఫీని త్రాగేసింది సుందరమ్మ ఎల్లయ్య గారి కూతురు వయసు బయటపడబోతోందనే సంతోషంలో.

*

క్యాలుక్‌లేటర్ చేసే వింతల్ని ప్రజలు కథలుగా చెప్పుకుంటున్నారు. అది–సర్వీసు కోసం వయసు తక్కువ చెప్పుకునేవారి గుట్టు బయటపెట్టింది. అమ్మమ్మల వయసు దగ్గర్నుంచీ పదేళ్ళు తక్కువ చెప్పి తమ వయసు పదేళ్ళు తగ్గించి చెప్పుకునే మహిళల గుట్టు రట్టుచేసింది. పైకి కాకపోయినా లోపల తిట్టుకుంటున్నారు క్యాలుకలేటర్ కనిపెట్టిన గణితశాస్త్రిని.

సంగీత రోజు కొకసారైనా అంటుంది.

"మా విమెన్స్ కాలేజీలో అంతా క్యాలుక్లేటర్‌ను గురించి అనుకునేవారే. పనిపాటా లేనివాడెవడో కనిపెట్టాడని–కన్పిస్తే మంచి సన్మానం చెయ్యాలని తిట్టుకుంటున్నారు. మీరేనని తెలిస్తే నన్ను ముందు చంపేస్తారు."

"చూడు స్వీటీ. ఆర్కిమెడేస్ అంతటి శాస్త్రజ్ఞుడ్ని పిచ్చివాడన్నారు. అన్నవాళ్ళే బ్రహ్మ రథం పట్టారు. అలాగే నన్ను తిట్టిన నోళ్ళే పొగడకపోవు. నువ్వు చూడకపోవు బేబీ." మీసం మెలిబెట్టుకుంటూ దుర్యోధనుడి లాగా పోజ్ ఇచ్చాడు.

ఒక రోజు గణితశాస్త్రికి సన్మానమంటూ ఆహ్వానమొచ్చింది. నోబుల్ ప్రైయిజు వచ్చినంత సంతోషపడ్డాడు జి. జి. శాస్త్రి. గర్వంగా సభలోకి అడుగుపెట్టాడు.

ఒక మగువ మిరపకాయలదండ మెళ్ళో వేసింది. ఘాటును తట్టుకోలేక తుమ్మసాగాడు గణితశాస్త్రి.

మాంచి దిట్టమైన అబలలు, అప్పడాల కర్రలతో, చిప్ప గరిటెలతో, అట్ల కాడలతో చుట్టుముట్టారు. పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడి లాగా పద్మాక్షుల వ్యూహంలో చిక్కుకున్నాడు గణితశాస్త్రి. కౌరవ సైన్యాన్ని చూసిన ఉత్తరకుమారుడి లాగా వణికి పోతున్నాడు. మనసులోనే ఆంజనేయస్తోత్రం పఠిస్తూ బిత్తరచూపులు చూడసాగాడు గణితశాస్త్రి.

"ఏం నాయనా, నీ నిర్వాకమేనా ఇది! పనీపాటాలేకపోతేసరి. ఎవరి వయసు ఎంత వుంటే నీకెందుకంట. నువ్వేమైనా యమధర్మ రాజువా, చిత్రగుప్తుడవా? ఇంకెప్పుడైనా మా వయసుల జోలికి వచ్చి ఇలాంటి పిచ్చి వేషాలు వేస్తే నీ బుర్ర రాంకీర్తన పాడిస్తాము. ఇప్పుడైనా మించిపోలేదు పత్రికాముఖంగా ప్రకటించెయ్యి– నీ క్యాలుకలేటర్ చెప్పే వయసు తప్పని దానికి పదేండ్లు మైనస్ చెయ్యాలని! చెప్పకపోయావో జాగ్రత్త." కళ్ళు వురిమింది ఒక కమలాక్షి.

"తల్లుల్లారా..." అనగానే అర్ధాంతరంగా ఆపింది ఒక ప్రౌఢ.

"ఏమన్నావు బుచ్చిబాబూ, నీ కళ్ళకి మేమం దరం తల్లుల్లాగా కనిపిస్తున్నామా. మాటలు సరిగ్గా రానియి."

"అమ్మమ్మా, అంతమాట........" అనగానే మళ్ళీ ఆపింది ఒక సబల.

"తల్లులన్నావు, ఇప్పుడు అమ్మమ్మలంటు న్నావా మనమడా, బ్రతుకు మీద నీకు ఆశలేదా?"

"సారీ సిస్టర్స్, నేనంత మాట అనలేదు. నే చెప్పేదేమిటంటే నా క్యాలుక్లేటర్ చెప్పేది తప్పు కాదని...."

"కాదు! తప్పేనని ఒప్పుకో. ఇదే ఆఖరి ఛాన్సు." ఒక అట్లకాడ పైకి లేచింది.

"అయ్య బాబోయ్. తప్పని ఒప్పుకుంటాను. ఇప్పుడే ప్రెస్‌కి వెళ్ళి రిపోర్ట్ చేస్తాను. నన్ను ముందు ఈ వ్యూహంలోంచి బయటపడనీయండి" చెమటతో తడిసిపోతున్నాడు గణితశాస్త్రి.

"సరే వదిలి వేస్తున్నాం. రేప్రొద్దుటే పేపర్లో ప్రకటన లేకపోతే సాయంత్రంకల్లా నీ పని ఖాళీ. జ్ఞాపకం వుంచుకో." అప్పడాల కర్రలు, అట్లకాడలు, చిప్పగరిటెలు దారిని వదిలాయి.

తల మీద చేతులు తియ్యకుండానే జై వీరాంజ నేయా అనుకుంటూ బయటకు దుమికాడు ప్రొఫె సర్ జి. జి. శాస్త్రి.

మంచం మీద నుంచి ధన్‌మని క్రిందపడ్డ గణితశాస్త్రిని లేపింది సంగీత.

"అర్ధరాత్రిపూట అంకమ్మశివాలులాగా ఏమిటీ క్రిందపడటాలు, కలవరింతలూ! మరీ మీకు మతి పోతోంది. లెక్కల పిచ్చి ఎక్కువయింది. లేచి మంచం మీద పడుకోండి." ఆవలిస్తూ భర్తను బలవంతంగా కూర్చోపెట్టింది సంగీత. బట్టతలను గట్టిగా పట్టుకున్న చేతులను ఊడదీసింది.

"అమ్మయ్య, ఇది కలేనా? ఇదే నిజమైతే ఇంకా ఎంత భయంకరంగా వుండేదో. భగ వంతుడా నేను చస్తే ఈ జన్మలో ఆ క్యాలుక్‌లేటర్ మాట ఎత్తుకోను. అయినా నేనేమైనా యమధర్మరాజునా, చిత్రగుప్తుడినా ఆ వూసు ఎత్తుకునేందుకు! ఆ గొడవేదో వాళ్ళే చూసు కుంటారు. బ్రతికాను భగవానుడా, ఇంకా నయం ఈ కల రాకముందే క్యాలుక్‌లేటర్‌ని కనిపెట్టేసి వుంటే నిజంగా నా బ్రతుకు జీరో అయివుండేది. బుద్ధి వచ్చింది." లెంపలు గట్టిగా వేసుకున్నాడు గణితశాస్త్రి.

క్యాలుక్‌లేటర్ ఏమిటో, యమ ధర్మరాజు, చిత్రగుప్తుడేమిటో లెంపలేసుకోడమేమిటో అర్థం కాక భర్తను విచిత్రంగా చూసింది సంగీత. ఆటువిమ్మట–విబూది తెచ్చి గణితశాస్త్రి నుదుటన అరచేతి మందాన రుద్దింది—మళ్ళీ పీడకలలు రాకుండా. □

[నేర్చుకున్న గుణపాఠం]

అజాగ్రత్త ప్రాణానికి ముప్పు తెస్తుందని అనుకోలేదు. అప్పట్నుంచి ఎంత జాగ్రత్తగా చూస్తానో, బిల్లు తీసుకుంటానో! ఇదే నేను నేర్చుకున్న గుణపాఠం.

—యెర్నేడ్డి రాజ్యలక్ష్మి



మా ఇంట్లో పాచి పని చేసే పని మనిషి ప్రొద్దుటే ఐదున్నర గంటలకల్లా వచ్చేస్తుంది. ఆ టైముకి లేవాలంటే నాకు చాలా బద్ధకం. కానీ తప్పదు. ఎందుకంటే ఎనిమిది గంటలకల్లా మా ఆయనగారు, పిల్లలూ స్కూటరు ఎక్కేస్తారు. కాబట్టి ఈ రెండు గంటల్లోనే నేను అష్టావధానం చేస్తుంటాను.

ఇటీవల ఓ రోజున మామూలుగా పని మనిషి తలుపు తడితే నేను వెళ్ళి తలుపు తీసేను. కానీ ఎదురుగా మా పనిమనిషికి బదులు కొత్త మనిషి వుంది. నేను ప్రశ్నార్థకంగా ఆవిడవైపు చూసేను.

"ఈ రోజు మా బొప్పి పనిలోకి రాదట నన్నెల్లమంది" అంది.

"అప్పాయమ్మ రాదా? ఏమయింది?" అన్నాను.

"కడుపులో నొప్పంటమ్మా, మూలుగుతా వుంది" అంది.

"నువ్వు అప్పాయమ్మకి ఏమవుతావ్?" అని అడిగేను.

"అప్పాయమ్మ పక్కింటిలోనే వుంటానమ్మా. నాకెక్కడా పనిదొరకలేదు. ఇంటికాడే వుంటున్నా. ఈ కబురు జెప్పిపోదామని వచ్చాను" అంది.

నా గుండెల్లో రాయి పడింది. అప్పుడు ఇంటి పనంతా చేసుకోవాలంటే నాకు టైము సరిపోదు. నా ఆఫీసుకి సెలవు పెట్టేయాలి. ఆఫీసులో కూడా చాలా పనుంది — ఎలాగా అనుకుంటుండగానే, "ఇల్లూడ్చి ఎల్లమంటారా అమ్మా" అని అడిగింది ఆమె. నిజం చెప్పాలంటే ఆ మనిషి నాకా క్షణంలో దేవతలా కనిపించింది.

"కొంచెం ఊడ్చేసి వెళ్ళిపో. వెళ్ళేటప్పుడు డబ్బు లిస్తాను" అన్నాను.

"డబ్బులెందుకు లెండమ్మా" అని చీపురందుకుంది.

గదులు ఊడ్చమని దగ్గరే — నించున్నాను. శుభ్రంగా నెమ్మదిగా అన్నిటి కింద నుండీ ఊడ్చింది. ఇంతలో పాలసీసా వస్తే తీసుకుని, పాలు పోసుకుని సీసా ఇచ్చేసి మళ్ళీ వచ్చి చూసేను. చాలా బాగా క్లీన్ చేసింది.

వాకిలి కూడా ఊడ్చేసి "వెళ్ళిపోతానమ్మా" అంది. ఒక పావలా ఇస్తే తీసుకుని వెళ్ళిపోయింది. అప్పాయమ్మ రానప్పుడు వచ్చి పని చేస్తుందమని చెప్పేను.

ఇంకో పావుగంట పోయిన తరువాత మా అప్పాయమ్మ వచ్చింది. "ఒంట్లో బాగో లేదు. రానన్నావట" అని అడిగేను.

"నేనెవరితోనూ సెప్పలేదమ్మా. నాకే నొప్పీ నేదు" అని ఆశ్చర్యపోయిందది. వెంటనే నా బుర్ర పనిచేసింది. చేతిలో పని వదిలేసి పరిగెత్తికెళ్ళి గదిలో అన్నీ వున్నాయో లేదో చూసేను. ఇంకేముంది? మావారి జేబు ఖాళీ! ఆరోజు రెండవ తారీఖు. ముందురోజు మావారు జీతం అందుకుని వచ్చేసరికి మేము రెడీగా వున్నాము. బీచ్‌కి వెళ్ళి, హోటల్‌కి వెళ్ళి, అటు నుంచి రెండవ ఆట సినిమాకి వెళ్ళి వచ్చేము. అందుచేత జేబులో జీతం బీరువాలో పెట్టడానికి వీలులేకపోయింది. మావారి జేబులో ఏడువందల రూపాయల చిల్లర వుంది. అదిగాక బల్ల మీదున్న మావారి వాచి కూడా లేదు. నాకు ఏడుపొచ్చినంత పనయ్యింది. మావారు నన్ను తిట్టేరు. నేను దాన్ని తిట్టేను. కానీ ఫలితం శూన్యం.

మేము తరువాత పోలీసు కంప్లయింటు ఇచ్చేము. ఆ మనిషి ఇలాగే పదమూడు దొంగతనాలు చేసి మా అక్కావాళ్ళింట్లోనే పట్టుబడింది. నా చిన్న పొరపాటువల్ల పెద్దగా మోసపోయేను.

—కరిబండి రుక్మిణీదేవి



# గుజరాత్ వంటకాలు

## కమంఢ్ డోగరా

కావలసిన వస్తువులు: రెండు కప్పుల శెనగ పప్పు, తగినన్ని పచ్చిమిరపకాయలు, కొత్తిమిర, వంట సోడా, ఉప్పు, పోపు దినుసులు.

తయారుచేసే విధానం: మధ్యాహ్నం టిఫిన్‌కి కావలసిన వారు ఉదయం సెనగపప్పుని నీళ్ళలో పోసి ఒక గంట నానిన తర్వాత ముతకగా పిండి రుబ్బుకోవాలి. పచ్చిమిర్చి, కొత్తిమిర సన్నగా తరిగి పెట్టాలి. టిఫిన్ చేసే ముందు ఉప్పు, వంటసోడా, తరిగి వుంచిన పచ్చిమిర్చి, కొత్తిమిర వేసి బాగా కలపాలి. తర్వాత బాణలిని పొయ్యి మీద పెట్టి కొంచెం నీరుపోసి ఒక పాత 'కుదురు' (పాత్రలకు కింద పెట్టే కుదురు — పాత్రలకున్న మసి నేలకు కాకుండా వుండేందుకు వాడతామే — అది) నీళ్ళల్లో పెట్టాలి. నీటి మట్టం కుదురు పైభాగానికి కొంచెం తక్కువగా ఉండేలా చూడాలి. ఒక వెడల్పాటి పళ్ళానికి నూనె రాసి పిండిని పోసి బాణలిలో కుదురుపై పెట్టాలి. ఆవిరి పోకుండా ఒక పెద్ద పళ్ళెం దానిపై బోర్లించాలి. ఇడ్లీ మాదిరి వుడికిన తర్వాత దించేసి చల్లార్చుకోవాలి. ఒక చాకుకు నూనె రాసి కావలసిన సైజులో ముక్కలు కోసుకోవాలి. పొయ్యి మీద బాణలిపెట్టి కొంచెం నూనెపోసి కాగాక పోపు దినుసులువేసి ఈ ముక్కలు వేసి ఒక అయిదు నిమిషాలు తేలికగా ముక్కలు చితకకుండా దోసెలకాడతో కలుపుతూ వేపాలి. ఈ టిఫిన్ చల్లారినా రుచి ఎంతో బావుంటుంది. టిఫిన్ బాక్సుల్లోకి పెట్టివ్వడానికి అనువుగా వుంటుంది. మద్రాసులో ఎక్కువమంది గుజరాతీలు (విద్యార్థినీ విద్యార్థులు, ఉద్యోగులు) మధ్యాహ్నం టిఫిన్లకి ఈ 'కమంఢ్ దోగరా'ను డబ్బీలలో తెచ్చుకుంటారు.

—గార్ల సరస్వతి

# సమస్యలూ-సలహాలూ

నిర్వహణ : కమలా వసంతకుమార్

ఆర్. ఓ.

మా అమ్మాయి వయసు 18 సంవత్సరాలు. ఆమెకు ఏడాది వయసు వున్నప్పుడు, పోలియో వ్యాధి వచ్చింది. మూడో సంవత్సరంలో వేలూరు ఆసుపత్రికి తీసుకువెళ్ళాము – ఆపరేషన్ చేశారు. కుంటుతూ నడుస్తుంది. అయితే చిన్నతనం నుంచీ అదోకలా మాట్లాడ్డం, కోపంతో ఏదేదో చెయ్యడం అలవడింది. అమ్మాయి పదో సంవత్సరంలో వుండగా,. వాళ్ళ నాన్నగారు పోయారు! అప్పట్నుంచీ ఆ ధోరణి మరీ ఎక్కువైంది. ఎలాగోలా ఏడవతరగతి వరకూ చదివింది. తెలివితేటలు బాగానే వున్నాయి. కొన్ని కొన్ని పన్లు చాలా తెలివిగా చేస్తుంది. ఇంటికి ఎవరేనా వస్తే వాళ్లను బాగా మర్యాద చేస్తుంది; బాగా మాట్లాడుతుంది. కాని, అక్కలను చూసినపుడు మాత్రం ఎందుకనో చాలా కోపంగా వుంటుంది. "మీకెవరికీ పెళ్లిళ్లు కాకూడదు; ఉద్యోగాలు దొరకకూడదు. మిమ్మల్ని చంపి – నేను చస్తాను" అని కేకలు వేస్తూ వుంటుంది. పధ్నాలుగేళ్ళ వయసులో వుండగా, మద్రాసు తీసుకెళ్ళి డాక్టర్ ధైర్యం క్లినిక్‌లో వుంచాము. అక్కడ ఒక నెల రోజులుంచారు. చికిత్స చేశారు. కొద్దిగా గుణం కనిపించింది. కాని, ఇంటికి తీసుకొచ్చిన కొన్నాళ్ళకు మళ్ళీ అలాగే మాట్లాడ్డం ఆరంభించింది. అక్కల మీద ఎందుకని ఆమెకు అంత ద్వేషం, కోపం వున్నాయో అర్థం కాకుండా వుంది. వాళ్ళు ఆమెను ఎంతో ప్రేమగా చూస్తారు; ఆమెకు అవసరమయే పన్లన్నీ చేస్తారు. కాని, "మిమ్మల్నందర్నీ నాశనం చేస్తాను చూడండి" అని ఈ అమ్మాయి అంటూనే వుంటుంది. ఇప్పుడిప్పుడు తనకు పెళ్ళి చెయ్యమని గొడవ చేస్తున్నది. చూస్తే – మరీ పిచ్చిగా కనిపించదు. కాని, కొన్ని సమయాల్లో మాత్రం చాలా తీవ్రంగా వుంటుంది. దాని మనస్తత్వం నాకు పెద్ద సమస్యగా పరిణమించింది. నాకు మీరు ఏం సలహా ఇవ్వగలరు?

నా ఉద్దేశంలో – ఆ అమ్మాయికి చిన్నప్పుడే పోలియో వ్యాధి వచ్చిందని – ఆమెను అతి ప్రేమగా, ముద్దుగా చూసినందువల్ల అలా తయారయిందేమోననిపిస్తుంది. ఆమె అడిగిందల్లా ఇచ్చి, ఆమె పాడిందే పాటగా, ఆడిందే ఆటగా అన్నింటికీ సహించి వూరుకున్నారేమో! రాను రాను, అది విపరీతం కావడంతో, తనలా కాకుండా మామూలుగా ఆరోగ్యంగా వుండే అక్కలను చూసి, ఈర్ష్య పడడం ఆరంభమై వుంటుంది. ఇందులో కొంత మెచ్చుకోదగ్గ విషయం ఏమిటంటే – అక్కలు ఆమెమీద అభిమానం, ప్రేమ చూపడం! అది ఎప్పటికైనా కొంత మేలు చేస్తుంది. ఆ అమ్మాయిని కొంతకాలంపాటు ధైర్యం క్లినిక్‌లో

ఈజిప్టుకు చెందిన షహీదా అబ్దెల్ అన్న 35 ఏళ్ళ వనిత ఇటీవల ఒక కొత్త రికార్డు సృష్టించింది! మధ్యధరా సముద్రం మీద పదివేల మీటర్ల ఎత్తున ఎగురుతున్న ఒక విమానంలో ఆమె తన తొలి శిశువును ప్రసవించింది. అలా ఆమె కొడుకు కైరోకు, రోమ్‌కు మధ్య ఆకాశమార్గంలో ఒక విమానవతి (ఏర్‌హోస్టస్) సాయంతో జన్మించాడు. ఈ వార్త రేడియో ద్వారా రోమ్ విమానాశ్రయంలోని కంట్రోల్ టవర్‌కు తెలియజేశారు. విమానం రోమ్‌కు చేరేసరికి అక్కడ అంబులెన్స్ సిద్ధంగా ఉంచి షహీదానూ, ఆమె బిడ్డనూ ఒక ఆస్పత్రికి చేర్చారు. అక్కడ ఆమె ఒక ఆడపిల్లను కని, ఆకాశమార్గంలో ఒక బిడ్డనూ, భూమి మీద ఒక బిడ్డనూ కన్న తొలి తల్లి అయింది!



పుంచానంటున్నారు. అయిన తర్వాత, వారు చెప్పిన విధానాలను సరిగా పాటించారా? వారు ఇచ్చిన మందుల్ని సరిగ్గా; క్రమం తప్పకుండా వాడారా? ఇలాంటి చికిత్సలు జరిగిన తర్వాత, ఇంటి వాతావరణంలో ఆ రోగికి ప్రశాంతమైన కొంత మార్పు కనిపించాలి. అలాంటిదేమీ జరగలేదేమో? బాగా కోపం వచ్చినప్పుడు తీవ్రమైన మాటలు మాట్లాడం సాధారణంగా, ఎవరికైనా సహజమే. కోపం వచ్చినప్పుడు ఒక్కొక్కరు ఒక్కోరకంగా, తీవ్రంగా ప్రవర్తిస్తారు. తనకు పెళ్ళి చెయ్యమని ఆమె అడుగుతోంది కాబట్టి–"నువ్వు కోపం తెచ్చుకోకుండా వుండాలి; అక్కల్ని తిట్టకూడదు. అలా తీవ్రంగా మాట్లాడకూడదు. సౌమ్యంగా వుండాలి. ఉంటే, పెళ్ళి చేస్తాము" అని చెప్పి చూడండి. మరి, ఆమెకు అంగవైకల్యం కూడా వున్నది కాబట్టి–ఆమెను చేసుకోడానికి ఎవరైనా ముందుకురావాలి! ఆమెను మళ్ళీ ఎక్కడైనా ఆసుపత్రిలో వుంచడంవల్ల అంత లాభం కనిపించదు. మీదగ్గర వుంటేనే, కొంత క్షేమదాయకం. ఆమె ప్రస్తుతం చదువుకుంటున్నదా? లేకపోతే స్కూలుకు వెళ్ళి చదువుకునే ఏర్పాట్లు చెయ్యండి. ఇంట్లో కూడా ఎప్పుడూ ఏదైనా చదువుకునేట్టుగా, శాంతంగా వుండేట్టుగా చూడండి.

## వనిత మాటల కొలువు - 27

సరైన సమాధానం:

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 చం | ద్రి | 13 క | | 2 హే | 14 వి | ళం | 15 బి |
| చ | | 3 ల | 16 బా | | ది | | డె |
| 4 ల | 17 నా | ఖం | ము | 18 ధ | య | | ము |
| | 5 గ | ద | | ర | | 19 ప | |
| | స | | 6 అ | ణ | | లు | |
| 7 క | ర | వా | ల | ము | | 8 కు | టి |
| 9 ర | ము | | స | | 10 అం | బ | |
| టి | | 11 ఆ | ట | | 12 క | డి | మి |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపిన వారు 28 మంది. వారు:

1. ఎ. ఎల్. వల్లీకార్తికేయి, శ్రీకాకుళం-1
2. వి. లీలావతీ నారాయణ, రాయదుర్గం
3. కొంపెల్ల మంగాయమ్మ, ద్రాక్షారామం
4. పి. గంగాదేవి, కాకినాడ-3
5. టి. శాంతాదేవి, వెలికట్టె (వరంగల్లు జిల్లా)
6. బి. గౌరి, గుంటూరు-2
7. సి. హెచ్. శోభారాణి, రాజమండ్రి
8. కమలా రామలింగం, రామవరం (కొత్తగూడెం)
9. వెలిచేటి నిర్మలాకుమారి, ఆచంట
10. సౌదామినీ నాగరాజన్, గుంతకల్లు
11. జాన మహలక్ష్మమ్మ, మలికిపురం (తూ. గో. జిల్లా)
12. ఎస్. రాజ్యలక్ష్మి, గంగారం (మహబూబ్ నగర్ జిల్లా)
13. పి. అన్నపూర్ణారాణి, సికింద్రాబాదు-26
14. భారతుల లక్ష్మీప్రేమావతి, నంద్యాల-1
15. ఐ. శ్రీదేవి, కదిరి
16. వై.ఎస్.ఎల్. కాంతిరామ్, విశాఖపట్నం-16
17. జి. శారద, సికింద్రాబాదు
18. ఎ. జయలక్ష్మిరాజు, అనంతపురం-1
19. ఎస్. సరస్వతి, హైదరాబాదు-29
20. పి. సత్యవతిశాస్త్రి, విశాఖపట్నం-4
21. నళినీదాస్, మదనపల్లి
22. గొటికల సౌదామణి, గుంటూరు-2
23. డి. లక్ష్మి, అమ్లాయ్ పేపర్‌మిల్స్ పి. ఓ. (మధ్యప్రదేశ్)
24. రామరాజు సుధాదేవి, హైదరాబాదు-44
25. పి. అరుంధతిదేవి, పార్వతీపురం
26. ఎం. శశికళ, మెదక్
27. ఎం. వసంత రాజారావు, హనుమకొండ
28. వి. స్వర్ణకుమారి, బాగలమర్రి (కర్నూలు జిల్లా)

బహుమతి మొత్తం రూ. 150లను ఈ ఇరవై ఎనిమిదిమందికీ సమానంగా పంచి అందజేస్తున్నాము.

డి. యమ్.

నేను మా వూళ్ళోని స్కూల్లో ఉపాధ్యాయురాలిగా పని చేస్తున్నాను. మా స్కూల్లో పదిమంది టీచర్లున్నారు. పదిమందిలోనూ ముగ్గురం - ఆడ టీచర్లం. మా ఆయన కూడా టీచరు ఉద్యోగమే చేస్తున్నారు. ఐతే, ఇంకొక స్కూల్లో చేస్తున్నారు. ఆయన పదమూడు సంవత్సరాలుగా ఆ ఉద్యోగంలో వున్నారు. నేను, రెండేళ్ళుగా వున్నాను. ఆయన చాలా అనుమానంగల మనిషి. నేను ఒకరితో మాట్లాడితే ఆయన సహించరు. చాలా కోపం తెచ్చుకుంటారు. స్కూల్లోని మగటీచర్లతో నేను మాట్లాడ్డం ఆయన చూస్తే–ఆ రోజు నరకమే. "ఏం మాట్లాడావు? ఎందుకు మాట్లాడావు?" అని నన్ను వేధిస్తారు; ఉద్యోగం మానేయమంటారు. నెలకు 400 రూపాయల ఉద్యోగం ఎలా మానెయ్యగలను? నాకు పెళ్ళయి పదేళ్ళు అయింది. ఒక పాప కూడా వుంది. నేను కాస్త అందంగా కనిపిస్తాను; ఎర్రగా వుంటాను. ఆయన నల్లగానూ బక్కగానూ వుంటారు. మేమిద్దరం కలిసి వెళ్ళినప్పుడల్లా, తనను అందరూ హేళన చేస్తారేమోనని, అనుమానాలతో నన్ను ఎన్నో మాటలంటారు. మంచి చీర కట్టుకోనివ్వరు; అలంకారం చేసుకోనివ్వరు. ఈబాధలను ఎవరితోనూ చెప్పుకోలేక, ఆయన్ని ఎదిరించలేక - నాలో నేనే క్రుంగిపోతున్నాను. ఈ పరిస్థితుల్లో నాకు విముక్తి లేదా?

దీనికి ముఖ్యంగా కావలసింది–"ఓర్పు". మీలో మీరు బాధపడకండి. మామూలుగా చాదస్తం గల కుటుంబాల నుంచి వచ్చే మగవాళ్ళకి ఇలాంటి అనుమానాలుంటూనే వుంటాయి. మీరు ఓర్పు వహిస్తూ, నెమ్మదిగా ఆయనను మార్చగలగాలి. ఆయన మీద మీకు ఎంతో ప్రేమ, అభిమానాలు వున్నాయని ఆయన తెలుసుకోగలగాలి. మీరు లేకపోతే, ఆయన జీవితం సరిగ్గా వుండదన్న సత్యాన్ని ఆయన తెలుసుకోవాలి. అవి ఆయన తెలుసుకునేట్టుగా, మీరు ఎలా ప్రవర్తిస్తారో–చూడండి. తొందరపడి, మీరు మీ ఉద్యోగానికి రాజీనామా ఇవ్వకండి. మీ ఆయనలో ఒక రకమైన 'కాంప్లెక్స్' ఏర్పడిపోయి వుంది. దాన్ని మీరే తొలగించాలి. ఆయనను మీరు ప్రేమగా, అభిమానంగా చూడండి. ఆయనకంటే మీకు అధికులు ఇంకెవరూ లేరన్నట్టుగా - ఆయనకు నమ్మకం కలిగించండి. ఆయనకు అనుమానం కలిగే విధంగా - ఎక్కడా ఎప్పుడూ నడుచుకోకండి. కొంత ఆత్మస్థైర్యాన్ని అలవర్చుకుని, ఓపికతో వుంటే ఆయనను మీరే దిద్దగలరు.



"అక్కయ్యా! ఒంట్లో కులాసాగా వుంటోందా!" గబగబా దగ్గరికి వచ్చింది వాణి.

అక్కా చెల్లెళ్ళిద్దరూ ఒకరివైపొకరు చూసుకున్నారు. ఇద్దరి కళ్ళు మౌనంగా భాషించుకున్నాయి. ఇద్దరి కళ్ళల్లోనూ నీళ్ళు చిప్పిల్లాయి. "అక్కా....!" అంటూ వాణి, "చెల్లీ....!" అంటూ వాహిని ఒకరినొకరు గాఢంగా కౌగిలించుకున్నారు.

"బాగుంది సంబరం....!" అంటూ బుగ్గలు నొక్కుకుంది వర్ధనమ్మ.

# తెల్లవారని రాత్రి

రాత్రి భోజనాలయ్యాక పరుపుచుట్ట పట్టుకుని డాబామీదికి దారితీసింది వాణి. "పడుకుందాం. రావే అక్కయ్యా!" అంటూ.

డాబామీద చాపవేసి దానిమీద పరుపు పరచి దుప్పటి దులిపి వేసింది వాణి. అక్కకి తనకి చెరో తలగడ పెట్టింది. "పడుకోవే అక్కా...!" అంటూ జడని తలగడమీంచి వెనక్కి పడేసి వెల్లకిలా పడుకుంది వాణి.

"కాస్సేపు చదువుకోవూ? అప్పుడే పడుకున్నావు?"

"ఇవేళ నువ్వొచ్చావుగా! అంచేత యీవేళ్టికి పుస్తకాలకి గుడ్‌బై కొట్టేస్తాను."

పిండారబోసినట్లుగా వుంది వెన్నెల.

"అక్కడి విశేషాలేమిటక్కయ్యా!" ఒత్తిగిలి అప్పుడే పడుక్కున్న వాహినిని గట్టిగా వాటేసుకుని పడుకుంది వాణి.

"ఏముంటాయ్! మామూలే!" పరధ్యానంగా అంది వాహిని.

"ఎందుకుండవు....? నీ గురించీ....బావగారి గురించీ...ఆయనకు నీమీదుండే ప్రేమ గురించీ... శోభ గురించీ–మీ అత్తగారి గురించి చెప్పాలంటే ఎంతేనా వుంటుంది."

"చెప్పడానికేముంది వాణీ! మా అసలత్తగార్ని నువ్వేకాదు, నేనూ చూడలేదు. మనవడు పోయిన బెంగతో మంచంపట్టి ఆరు నెలల్లో పోయారావిడ. ఆ తర్వాత ఆవిడ చెల్లెలు మావారి యోగక్షేమం చూస్తూండేది. ఆ తర్వాత ఏడాదికి మా పెళ్ళి జరిగింది. మావారు మళ్ళీ పెళ్ళి చేసుకోవడం అక్కయ్యకి–అదే, తొలి ఆవిడకి–యిష్టం లేదు. పెళ్ళి మాటలు అనుకుంటూంటే ఓ రోజు రాత్రి వచ్చి ఆమె పిల్లవాడ్ని తీసుకుపోయింది. అదంతా ఒక చిత్రమైన కథ!"

అంటూ తన భర్త తనకు చెప్పినదంతా వర్ణించి చెప్పింది వాహిని.

ఆశ్చర్యంగా కథంతా విని, "ఇది నిజంగా జరిగిందంటే నమ్మలేకుండా వున్నానక్కయ్యా!" అంది వాణి.

"నాకూ అలాగే అనిపించింది. కాని కళ్ళారా చూసిన ఆయన చెబుతూంటే నమ్మకుండా వుండటం ఎలా! తలుచుకుంటే ఎంతో బాధగా వుంటుంది. ఆవిడకి యిష్టంలేని పెళ్ళికి యీయన సిద్ధపడటం చేతకదా రత్నం లాంటి పిల్లవాడు మట్టిలో కలిసిపోయాడు అని. కాని అనుకోవడమే కాని మన చేతుల్లో ఏం లేదు." అని నిట్టూర్చింది వాహిని.

"ఇంతకీ బావగార్ని కొంగున ముడేసుకున్నావా లేదా?" విషాద వాతావరణాన్ని తేలిక చెయ్యాలనే ఉద్దేశంతో కిలకిలా నవ్వింది వాణి.

"నేను వేసుకునేదేమిటి? ఆయనే వేసుకున్నారు నన్ను–తన ఉదాత్త హృదయంతో–"

"అయ్య బాబోయ్....! పెద్ద రచయిత్రిలా మాట్లాడేస్తున్నావు."

"నిజం వాణీ....! నేను చెబుతున్నది నూటికి



# పెదపూడి రాజ్యలక్ష్మీదేవి

నూరు పాళ్ళూ సత్యం. ఏ మగవాడూ సహించలేని నిజాన్ని ఆయన ఓర్పుతో భరించారు. అవమానంతో కుమిలిపోతున్న నన్ను ఒడిలోకి తీసుకుని లాలించి ఓదార్చారు. ఆయన వ్యక్తిత్వం అంత గొప్పది వాణీ! ఆయన పాదరేణువును నేను.'' వాహిని కంఠం గద్గదమైంది. ఆమె కనుకొలుకుల్లో నీళ్ళు నిండాయి.

చలించిపోయింది వాణి.

''ఏమిటక్కయ్యా! పెళ్ళి ముందు నుంచీ చూస్తున్నాను. నీలో నువ్వే కుమిలిపోతున్నావు. నీ రక్తం పంచుకు పుట్టినదాన్ని. నీ మనస్సులోని బాధేమిటో నాతో చెప్పకూడదా! చివరికి ఆత్మహత్య చేసుకోవడానికి కూడా ప్రయత్నించావు. అమ్మావాళ్ళు యీ పెళ్ళి యిష్టంలేక అలా చేసావనుకున్నారు. కాని నేను నమ్మలేదు. అంతకుమించిన బలమైన కారణం మరేదో వుండి వుంటుందని తోచింది నా మనస్సుకి.''

''నువ్వూహించినది కరెక్టే వాణీ! కాని ఆ విషాదాన్ని నీతో చెప్పలేను. అంతే. నన్నిక బలవంతపెట్టకు!'' అంటూ తల పక్కకి తిప్పుకుంది వాహిని.

ఆకాశంలో కలువలరేడు నవ్వుతున్నాడు. తెల్లమేఘాలు, మధ్య మధ్య నల్లమేఘాలు. అతనికి అడ్డువస్తూ—మళ్ళీ పక్కకి తొలగిపోతూ దాగుడుమూతలాడుతున్నాయి.

ఆ దృశ్యం చూసి నిట్టూర్చింది వాహిని. జీవితం కూడా అంతే అనిపించిందామెకి. జీవితంలో కష్టసుఖాలు కూడా ఆ మబ్బుల్లాగే వస్తూ పోతూ, వెలుగు నీడల్లా ఒకదాని వెంట మరోటి పరిభ్రమిస్తూ వుంటాయి.

వాణి యింక రెట్టించి అడగలేదు.

వాహిని లేచి మోకాళ్ళ మీద తలానించుకుని కూర్చుంది.

''ఏం, అక్కయ్యా లేచావు....?'' అన్నది—వాహిని ప్రతి కదలికనూ గమనిస్తున్న వాణి.

''ఏం లేదు. నిద్ర రావడంలేదు.'' క్లుప్తంగా అంది వాహిని.

వాణి కూడా లేచి కూర్చుంది. తమ్ముళ్ళ చదువు గురించీ, ఆమె స్కూలు గురించీ ఎన్నో సంగతులు మాట్లాడింది.

''చాలా టైమై వుంటుందక్కయ్యా! ఇంక పడుకో...!'' అని ఆవలిస్తూ పడుక్కుంది.

వాహిని కూడా పడుకుంది.

ఎంత ప్రయత్నించినా నిద్రాదేవి ఆమె దరిదాపులకి కూడా రావటం లేదు. మనస్సులో గత స్మృతులు తరంగాలుగా లేచి ఒక్కమారు ఆమె మనస్సుని ఉక్కిరి బిక్కిరి చేసి నెమ్మదిగా అణగుతున్నాయి. ఒక జ్ఞాపకం తర్వాత మరో జ్ఞాపకం ఆమెను తుఫాను సమయంలో సముద్రంలో కెరటాల్లా కలవర పెడుతున్నాయి.

'ప్రకాష్‌కి పెళ్ళయిపోయి వుంటుంది. అతడి భార్య ఎలా వుంటుందో!'

నెమ్మదిగా లేచి పిట్టగోడ దగ్గరికి వెళ్ళి నిలబడింది వాహిని.

పుచ్చ పువ్వులా కాస్తోంది వెన్నెల. గాలి తెరలు తెరలుగా వచ్చి చల్లగా చెంపల్ని తాకుతోంది. గాలికి ఎగురుతున్న ముంగురుల్ని వెనక్కి తోసుకుంటూ శారదమ్మగారింటి వేపు చూసింది వాహిని.

ఆ వెన్నెల్లో ఏవో రహస్యాల్ని దాచుకున్న గాంభీర్యంతో నిలబడివుందా మేడ. మాధవీలత విరగబూసి వెన్నెల్లో చిత్రంగా వెన్నెలపూలు పందిరి నిండా చల్లినట్లుగా అనిపిస్తోంది. దారికటూ యిటూ వున్నతంగా ఎదిగిపోయిన ఎవర్‌గ్రీన్ వృక్షాలు, 'ఆనాటి చరిత్రకి మేమూ సాక్షులమే!' అన్నట్లు గాలికి అటూ యిటూ వూగుతున్నాయి.

మెల్లగా నిట్టూర్చింది వాహిని.

భుజం మీద చెయ్యి పడేసరికి పక్కకి తిరిగి చూసింది.

వాణి....!

''ఏమిటక్కయ్యా! అంత దీర్ఘాలోచన? చంద్రుడు నడినెత్తి మీదికి వచ్చేసాడు.'' అంది.

''ఏమిటో....! ఏవేవో ఆలోచనల్లతో నిద్ర పట్టలేదు వాణీ....!'' అంది వాహిని.

వాహినివైపు జాలిగా చూసి, ''రా అక్కయ్యా పడుకుందాం. కళ్ళు మూసుకు పడుకుంటే నిద్ర అదే వస్తుంది.'' వాహిని చెయ్యి పట్టుకు లాక్కుపోయింది వాణి.

అక్కచెల్లెళ్ళు ఇద్దరూ పక్కమీద పడుక్కున్నారు.

వాణి పసిపాపలా వాహినిని వాటేసుకుని పడుకుంది.

కొంత సేపయ్యాక, ''వాణీ....!'' అని పిలిచింది వాహిని.

''పిలిచావా అక్కయ్యా....!'' కళ్ళు తెరిచింది వాణి.

''ఇంకా నిద్రపోలేదూ....!''

''ఇప్పుడిప్పుడే చిన్న కునుకు పట్టింది. నువ్వు పిలిచేసరికి మెలకువ వచ్చింది.'' అంది వాణి ఆవలిస్తూ — బద్ధకంగా.

''ఈ ఊళ్ళో విశేషాలేమిటే!''

''ఉన్నవేవో యిందాక చెప్పానుగా! మిగిలినవేవైనా వుంటే రేపు చెప్తాలే. పడుకో — పన్నెండు కూడా కొట్టారు.''

''అబ్బ కాస్త చెబుదూ! పడుకుందువు గాని.''

''ఏం చెప్పమంటావు....?'' అంది నిద్ర మత్తులోనే బద్ధకంగా.

''శారదమ్మగారి కోడల్ని చూసావా?'' మనసులో మాట బైట పెట్టేసింది వాహిని.

వాణి నిద్ర మత్తు కాస్త వదిలింది ఆ మాట వినగానే.

అక్కయ్యవేపు దీక్షగా చూస్తూ, ''చూసాను. శ్రావణ మాసంలో ఆఖరి వారాలు రెండూ యిక్కడే నోచుకుంది. వచ్చి పిలిస్తే పేరంటానికి వెళ్ళాను.''

''ఎలా వుంటుందే ఆ అమ్మాయి....?'' సాలోచనగా అడిగింది వాహిని.

''ఫరవాలేదు. అంతా చాలా బాగుందన్నారు కాని నాకేమంత గొప్ప అందం కనిపించలేదా అమ్మాయిలో. నీ ముందు దీపికట్టే! అసలు

అందం కన్న, తెచ్చి పెట్టుకున్న పైమెరుగులే ఎక్కువ. వీణ వాయిస్తుంది. బి. ఏ ప్యాసైంది. పేరు శాంత.''

''ఇప్పుడిక్కడే వుందా?''

''లేదు. పుట్టింట్లో వుంది.''

''శారదమ్మగారు కులాసాగా వున్నారా?''

''ఊ....''

''ఈ మధ్య నాకూ వీణ నేర్చుకోవాలని బుద్ధి పుట్టింది. మీ బావగారు వీణ కొన్నారు. మాస్టర్ని కూడా పెట్టారు. ప్రతి ఆదివారం పట్నం నించి వచ్చి నేర్పుతూ వుంటారు. అందుకే వీణ కూడా నాతో తెచ్చుకున్నాను. మరచిపోకుండా రోజూ సాధకం చేసుకోవచ్చునని.''

''మంచి పని చేస్తున్నావక్కయ్యా....వీణ నేర్చుకోవడం, మనస్సుకి ఉల్లాసం కలుగ జేస్తుంది.''

ఇద్దరూ కాస్సేపు మౌనంగా వున్నారు.

ఉన్నట్లుండి లేచి కూర్చుంది వాణి.

''అక్కా! నాకో సందేహం వచ్చిందే! నీ జీవితంలో ప్రవేశించి నిన్ను బాధపెట్టిన వాడు ప్రకాష్ కాదు కదా!''

తబ్బిబ్బు పడింది వాహిని.

కాస్త సర్దుకుని, ''వాణీ! చిన్నదానివి నీకెందుకే యిలాంటి ఆలోచనలు? కళ్లు మూసుకు పడుకో!'' అంది వాహిని.

''ఉహు....ఈ విషయం చెబితే కాని నేనసలు నిద్రపోను. ఇవేళ నీ మనస్సంతా నాతో విప్పి చెప్పాలి. నీ బాధలలో నన్నూ పాలు పంచుకో నివ్వాలి. నువ్వు చెప్పిన విషయాలు నాలోనే దాచుకుంటాను. ఇంకెవ్వరితోనూ చెప్పను, ఒట్టు.'' అంది వాణి తన తల మీద అర చెయ్యి పెట్టుకుని.

నిట్టూర్చింది వాహిని. ''నాదొక విషాదగాథ చెల్లీ! అదంతా చెబితే నీ మనస్సు గాయపడు తుందేమోనని ఇన్నాళ్ళూ సందేహించాను. ఏ రోజు రాకూడదని నేను భగవంతుడిని ప్రార్థించానో ఆ రోజు రానే వచ్చింది. నాకన్న చిన్నదానివైన నీ ముందు నా తప్పటడుగు గురించి చెప్పాల్సిన సమయం వచ్చింది. సరే....! ఏం చేస్తాం! ఇదీ ఒకందుకు మంచిదేలే. విద్యావతివైన నువ్వు మోహపు మాటలకి మోసపోకుండా వుండేందుకూ, చేతులు కాలాక ఆకులు పట్టుకోకుండా ఉండేందుకూ నా కథ పనికి వస్తుంది.'' అంటూ, తనకీ ప్రకాష్‌కీ పరిచయమైనప్పటి నుంచి తాను భర్తకి జరిగింది చెప్పేసి శిక్షించమని అడగటం వరకు చెల్లెలితో చెప్పింది వాహిని.

అంతా విన్న వాణి మొహం కోపంతో జేవు రించింది. ''దుర్మార్గుడు, నిన్ను అమాయకు రాల్ని చేసి ఎంత మోసం చేసాడు! వెంటనే నాన్నగారితో ఎందుకు చెప్పావు కాదక్కా, వాడిని కోర్టుకీడ్చి మూడు చెరువుల నీళ్ళు తాగించేవాళ్ళం. నయానా భయానా చెప్పి మీకిద్దరికీ పెళ్ళి జరిపించే వాళ్ళం.''

విరక్తిగా నవ్వింది వాహిని.

''ఏమిటో చెల్లీ....! నీ బాధకొద్దీ నువ్వం టావు కాని ప్రేమానురాగాలు పూజ్యమైన దాంపత్యం నరకమౌతుందే కాని నందనవనం కాదు కదా!''

''నిన్ను చూస్తే చాలా బాధగా వుంద క్కయ్యా!''

''అందుకే యిన్నాళ్ళూ నీతో యీ విషయం చెప్పలేదు. నిన్నూ బాధపెట్టిన దాన్నవుతానేమోననే సందేహంతో. ఇప్పుడు నా దృష్టిలో ప్రకాష్ ఒక వంచకుడు మాత్రమే. అంతకుమించి అతనిపట్ల నాకే భావమూ లేదు. ఊరికే అతని భార్య గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో అడి గాను. అంతే.''

వాణి నిట్టూర్చింది. అక్కని మరింత గట్టిగా కౌగిలించుకుని పడుక్కుని ఒక కాలు వాహిని మీద వేసింది.

''నా బంగారు అక్కయ్యా! ఇంత చిన్న వయస్సులో నీకెన్ని కష్టాలొచ్చాయే!'' అంటూ వాహిని గుండెల్లో తల దాచుకుంది.

వాణి తల మీద చెయ్యి వేసి ఆప్యాయంగా నిమరసాగింది వాహిని.

పక్కనే వున్న పోలీస్ స్టేషన్‌లో ఒంటి గంట కొట్టారు.

పది నిముషాల్లో వాణి నిద్రలోకి జారిపోయింది.

వాహినికి మాత్రం ఆ తర్వాత చాలాసేపటి వరకు నిద్ర పట్టలేదు.

## 13

ఆ రోజే వాహినికి గాజులు పెట్టించే రోజు. ఆ ముందు రోజే మధుసూదనం, అతని పినతల్లి, శోభ వచ్చారు. ఆ రాత్రి వాహిని పక్కలోనే పడుకుంది శోభ.

పొద్దుట ఎనిమిదింటికి ముహూర్తం. గాజుల బత్తుడు వచ్చి, గాజులతో ముందు గదిలో కూర్చున్నాడు.

తలంటుకుని, కొత్త చీర కట్టుకుంది వాహిని. పొడుగాటి జడ వీపుమీంచి పిరుదులదాకా నల్ల తాచులా వ్యాపించి వుంటే, కంటి కాటుక రేఖలు చేపలతో పోటీ పడుతూంటే నుదుట వున్న కుంకుమ సూర్యుడిని పోలి వుంటే, చెంపల్లో కొత్త కాంతు లీనుతూ వుంటే, పూల జడలోని విచ్చుకున్న బొద్దుమల్లెలు చెలిని చూసి ఫక్కుమని నవ్వుతూంటే, నునుసిగ్గుతో వచ్చి గాజుల బత్తుడి ముందు కూర్చుంది వాహిని.

''మీ కుడి చెయ్యి యిలా యియ్యండి తల్లీ....!'' అంటూ వాహిని చేతిని అందుకుని మంచి రకాల గాజులు తీసి చేతికి ఎక్కించ సాగాడు గాజుల బత్తుడు.

'మా తల్లి చెయ్యెంత మెత్తనో మనసంత మెత్తన!' తనలో తాను అనుకుంటున్నట్లు పైకే అనేసాడు గాజుల బత్తుడు.

ఆ మాట వాహిని హృదయానికి సూటిగా తగిలింది. 'అవును. తనది సున్నితమైన మన స్సవడంవల్లనే ప్రకాష్‌ని తేలిగ్గా నమ్మింది. తన మనస్సు సుతి మెత్తన కావడంవల్లనే అతడు తన బ్రతుకులో నిప్పులు పోసాడు. ఈ ప్రపంచంలో బ్రతకాలంటే మనస్సు సున్నితంగా వుండకూడదు. రాయిలా కఠినంగా వుండాలి!' అనుకుంటూ చెల్లెలి వైపు చూసింది.

అదే సమయానికి వాణి కూడా వాహినివైపే చూస్తోంది. ఇద్దరి కళ్ళూ కలుసుకుని మౌనంగా భాషించుకున్నాయి.

ఒక్కొక్క చేతికి పదకొండు జతల గాజులు తొడిగాడు బత్తుడు.

గాజులమలారానికి నమస్కరించి లేచింది వాహిని.

ముఖ్యుల్ని భోజనానికి పిలిచారు. పిండి వంటలతో అంతా విందుభోజనం చేసారు.

సాయంత్రం పేరంటం జరిపారు.

మధుసూదనం తెచ్చిన పట్టుచీర కట్టుకుంది వాహిని. నెమలి కంఠంరంగులో అక్కడక్కడ జరీ పువ్వులతో నాలుగు వేళ్ళ వెడల్పు జరీ అంచుతో




గ్రేటర్ వాషింగ్‌టన్‌లో తెలుగు సాంస్కృతిక సంఘం వున్నది. తెలుగు పుస్తకాలతో గ్రంథాలయం స్థాపించుకోవాలన్న ఉద్దేశంతో విరాళాలు పోగుచేసి, మనదేశం నుంచి పలు పుస్తకాలు తెప్పించారు. ఈ మధ్యనే ఆ గ్రంథాలయానికి ప్రారంభోత్సవం కూడా జరిగింది. (పై ఫోటో ఆ సందర్భంలో తీసినది) ఆనాటి ఉత్సవంలో అక్కడ వున్న తెలుగు వారందరూ దాదాపు పాల్గొన్నారు. భారత దౌత్య కార్యాలయంలో పనిచేస్తున్న శ్రీ రెహమాన్–తమ కార్యాలయం ద్వారా మరిన్ని పుస్తకాలు సమకూర్చగలమని వాగ్దానం చేశారు. ప్రస్తుతం ఈ గ్రంథాలయంలో (ప్రాచీన గ్రంథాలు, ఆధునిక గ్రంథాలు అన్నీ కలిసి) నాలుగు వందలదాకా ఉన్నాయనీ, ఇంకొక మూడు వందల పుస్తకాలకు ఆర్డర్ వెళ్ళిందనీ సాంస్కృతిక సంఘాధ్యక్షులు శ్రీ రమణరావు తెలియజేశారు. ముఖ్యంగా తమకు–ఈ గ్రంథాలయం ఎంతగానో ఉపయోగకరంగా వుండ గలదని, ఆ రోజు హాజరైన వనితలందరూ భావించారు. వాషింగ్టన్ నగరంలోనూ, పరిసర ప్రాంతాల్లోనూ మొత్తం మూడువందల తెలుగు కుటుంబాలున్నాయి.

ఎంతో అందంగావుందా చీర. ఆ చీర కట్టుకుని వంటినిండా నగలతో, కొద్దిగా వొళ్ళుచేసిన వాహిని భారంగా నడుస్తూంటే హుందాగా ఎంతో అందంగా వుంది.

పేరంటాళ్ళ ముందుకు వెళ్ళి కూర్చునే ముందు చాటుకి పిలిచి ఒక ముద్దిస్తేకాని వదల్లేదు మధుసూదనం.

వాహినిని కుర్చీలో కూర్చోబెట్టి హారతి యిచ్చారు. వచ్చినవాళ్ళంతా తాము తెచ్చిన బహుమతుల్ని వాహినికి యిచ్చారు.

వచ్చినవాళ్ళందరికీ, పసుపూ, బొట్టు, గంధం, వాయినంయిచ్చి పంపిస్తున్నారు.

ఇంతలో సన్నగా పొడుగ్గా చామనచాయలో వున్న ఒక అమ్మాయి పట్టుచీర కట్టుకుని, వొంటి నిండా నగలతో వచ్చి కూర్చుంది.

వాణి వాహినికి దగ్గరగా వెళ్ళి వంగి "అటు చూడక్కయ్యా! ఆమే ప్రకాష్ భార్య శాంత. ఇవేళ ప్రొద్దుటే పుట్టింటి నించి వచ్చింది." అంది చెవిలో మెల్లగా.

తలయెత్తి చూసింది వాహిని.

చామనచాయలో కళగా వున్న ఆ యువతి మొహంలో ప్రసన్నత కన్న అహంకారం పాలే ఎక్కువగా కనిపించింది. న్యాయంగా తను పొందాల్సిన స్థానాన్నాక్రమించుకున్న శాంతపట్ల వాహినికి అసూయ కలుగలేదు సరికదా జాలి కలిగింది. ప్రకాష్ లాంటి పూసరవెల్లితో ఆమె దాంపత్య జీవనం ఎలా వుంటుందోనని కించ పడింది మనస్సులో.

వాహిని శాంతవైపు చూస్తున్న సమయంలోనే శాంత కూడా వాహిని వైపు చూసింది. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

వాహిని పలుకరింపుగా మందహాసం చేసింది. జవాబుగా శాంత పెదవులు కూడా విచ్చుకున్నాయి.

వాయినం పుచ్చుకున్నాక శాంత లేచి వాహిని దగ్గరగా వెళ్ళి, "వస్తానండీ....!" అంది.

వాహిని కుర్చీలోంచి లేచి శాంత చేతులు తన చేతుల్లోకి తీసుకుని, "అత్తయ్య రాలేదేం!" అంది ఆప్యాయంగా.

"ఆవిడా! ఆవిడ నేను వచ్చి వెళ్ళాక వస్తానన్నారు. బంధువులు వస్తామని వుత్తరం రాసారు. వాళ్ళకోసం ఎదురుచూపులు." అంది శాంత పుల్లవిరిచినట్లుగా.

శాంత పెడసరం జవాబు విని తెల్లబోయింది వాహిని. 'కనీసం అత్తగారన్నా అనకుండా ఆవిడ అని, చెప్పడంలోనే శాంత సంస్కారం బయట పడుతోంది' అనుకుంది వాహిని.

"ఆవిడకి మీరంటే ఎంతో అభిమానం అనుకుంటాను. అస్తమానం మిమ్మల్ని తలుచుకుంటూ వుంటారు." అంది అదే స్వరంతో– కొద్దిగా చిరునవ్వు జోడించి.

శారదమ్మగారికి తనపట్ల గల అభిమానాన్ని శాంత జ్ఞాపకం చెయ్యగానే వాహిని హృదయం స్పందించింది. ఏవేవో జ్ఞాపకాల తెరలామెను చుట్టు ముట్టాయి.

పైకి రాబోతున్న నిట్టూర్పును అణుచుకుంటూ, "నిజమే....! మీ అత్తగారికి నేనంటే ఎంతో అభిమానం." అంది వాహిని.

శాంత వెళ్ళిపోయింది.

వాహిని తిరిగి కుర్చీలో కూర్చుంది. కాని ఆమె మనస్సులో పాత జ్ఞాపకాలు ఒకదాని వెంట ఒకటి పోటీపడుతూ తరుముకొస్తున్నాయి.

ఈ జ్ఞాపకాల నుంచి ఎలా తప్పించుకోవడం! ప్రకాష్! శాంతని చూసేసరికి ప్రకాష్ జ్ఞాపకం వచ్చాడు. "తనని ఎంతగా నమ్మించాడు! చివరికి తన మనస్సుని శూన్యం చేసిపోయాడు. అంతా సవ్యంగా వుంటే శాంత స్థానంలో తను వుండేది," ఆ ఆలోచన రాగానే ఒక్కమారు వులిక్కిపడింది వాహిని. 'మళ్ళీ ఏమిటిది! తన మనస్సు పగ్గాలు తెంచుకుపోతోంది! ఆలోచించ కూడని విధంగా ఆలోచిస్తోంది,' అనుకుంది.

# రానిపాల్

## సర్వోత్తమ తెలుపు కోసం






రానిపాల్ నూలు దుస్తులకు

రానిపాల్-ఎస్ సింథెంటిక్ మరియు మిశ్రమ దుస్తులకు

Shilpi-SG 1a/77 tel

ప్రకాష్ రూపుని ప్రయత్నం మీద జ్ఞాపకాల్లోంచి చెరిపివేసినా ఒకనాటి తమ క్షణికోద్రేక ఫలితంగా అతడి రూపం తన కడుపులో వూపిరిపోసుకుంటోంది. ఆ భయంకర సత్యాన్ని తానెలా కాదనగలదు? నిత్యం తన ఎదురుగా తిరుగుతూ తన బాబు, గతాన్ని గుర్తు చేస్తూంటే తానెలా భరించగలదు? ఆయన తనను క్షమించినా తన మనస్సాక్షి మాత్రం తనని క్షమించడంలేదే! పాత జ్ఞాపకాలు తలెత్తేసరికి మనస్సు నరకాన్ని చవిచూస్తోంది. శాంత కనిపించేసరికి యిన్నాళ్ళుగా అణగివున్న జ్ఞాపకాలన్నీ మళ్ళీ తలెత్తి విజృంభించాయి. అబ్బా....! ఏమిటిది....? నరాలన్నీ యింత వుద్రిక్తతకు లోనవుతున్నాయి! తల తిరిగిపోతోంది. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. తనకేమౌతోంది? అనుకుంటూ కుర్చీలో జార్లబడింది వాహిని. ఆమె తల ఒకపక్కగా వాలిపోయింది. ఆమెకి పూర్తిగా స్పృహ తప్పిపోయింది.

వాహినిని ఆ స్థితిలో చూసిన వాణి పరిగెత్తుకుంటూ వచ్చింది. 'అక్కయ్యా....ఏమైందే....' అంటూ కుదిపింది.

మాట్లాడలేదు వాహిని. ఆమె కళ్ళు మూతలు పడివున్నాయి.

"అమ్మా...! అమ్మా...! త్వరగా రండే...!! అక్కయ్యేందుకో మాట్లాడటంలేదు!" ఏడుపు గొంతుతో గట్టిగా అరిచింది వాణి.

వాణి అరుపు విని అంతా ఒక్క పరుగున వచ్చారు.

వాహిని నా స్థితిలో చూసి కంగారు పడ్డారంతా.

"ఇంతసేపూ బాగానే వున్నావు. ఇంతట్లోనే ఏమైందే నా తల్లీ....!" అంటూ వర్దనమ్మ కూతురి తల నిమురుతూ ఏడుపు సాగించింది.

"ఎందుకే అలా ఏడుస్తావు? కాస్త నీరసం వల్ల కళ్ళు తిరిగి వుంటాయంతే. వెళ్ళి డాక్టర్ని తీసుకు వస్తాను." కండువా భుజాన వేసుకుని చెప్పులు తొడుక్కుని గబగబా వీధిలోకి వెళ్ళారు రాఘవయ్య.

దగ్గర్లోనే వున్న విసనకర్ర తీసుకుని విసరసాగాడు మధుసూదనం.

వాణి గ్లాసుతో చన్నీళ్ళు తెచ్చి అక్క మొహం మీద చల్లింది.

ఆ సమయంలో శారదమ్మగారు వచ్చారు.

"ఇదేమిటీ అంతా కుర్చీ చుట్టూ అలా గుమికూడారు? అరె! వాహినికేమైంది?" అంటూ ఆదుర్దాగా దగ్గరకి వచ్చారు.

"ఇప్పటిదాకా నిక్షేపంలా వుందండీ పిల్ల. వున్నట్లుండి తెలివి తప్పిపోయింది. ఏం ఖర్మో కాని!" నుదురు కొట్టుకుంటూ అంది వర్దనమ్మ.

ఇంతలో డాక్టర్ని తీసుకుని రాఘవయ్య రావడంతో అంతా పక్కకి తప్పుకుని దారిచ్చారు.

రాఘవయ్య మందులపెట్టి తెచ్చి అక్కడ వున్న స్టూలు మీద పెట్టాడు.

నాడి చూసి, స్టెతస్కోపుతో గుండెలు పరీక్షించి "మీరేం కంగారు పడాల్సిన పని లేదండీ. నరాల బలహీనత వల్ల యిలా జరిగింది. మైండ్‌ని అప్‌సెట్ చేసే సంఘటనేదో జరిగి వుంటుంది." అని గ్లూకోజ్ ఇంజక్షను యిచ్చాడు.

వాహిని కొంచంగా కదిలి, "అబ్బా....!" అంది.

డాక్టరు 'ఇక నే నెళ్తానంటూ' మందుల పెట్టె అందుకుంటూంటే–"నే తెస్తానుండండి" మర్యాదకి డాక్టరు చేతుల్లోంచి మందుల పెట్టె అందుకున్నాడు రాఘవయ్య. మధుసూదనం కూడా గుమ్మందాకా వెళ్ళి డాక్టర్ని సాగనంపి వచ్చాడు.

"వాహినీ....వాహినీ....!" వంగి వాహిని చెవిలో పిలిచాడు మధుసూదనం.

నెమ్మదిగా కళ్ళు విప్పింది వాహిని.

"ఎలా వుంది వాహినీ....'" మృదువుగా ఆమె చేతిని నిమురుతూ అడిగాడు మధుసూదనం.

అతని కంఠంలో ధ్వనించిన ఆర్ద్రతకి చలించిపోయింది వాహిని.

నెమ్మదిగా కళ్ళెత్తి భర్త వైపు చూసింది.

ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

అతని కళ్ళల్లో అనురాగం, ఆందోళన మిళితమైవుంది.

వాహిని హృదయం స్పందించింది. భర్త చేతుల్లో వాలిపోయి అతని విశాల వక్షస్థలం మీద తల ఆనించి తనివితీరా ఏడవాలనే కోరిక బలంగా కలిగింది. కానీ, నిగ్రహించుకుంది. చుట్టూ వున్న జనాన్ని చూసి పైకి పెల్లుబికి రాబోతున్న ఏడుపును అతి ప్రయత్నం మీద ఆపుకుంది. ఛీ...ఛీ ఏమిటిది! నా మనస్సింత బేలగా అయిపోతోందేమిటి? అనుకుని బాధగా నిట్టూర్చింది వాహిని.

"వాహినీ....! ఎలా వుందమ్మా....?" కంగారుగా దగ్గరికి వచ్చి కూతురి చేతులు పట్టుకుని ప్రశ్నించింది వర్దనమ్మ.

బాగానే వుందన్నట్లు తలూపింది వాహిని.

తన వైపే ఆందోళనగా చూస్తూ కాస్త దూరంలో నిలబడ్డ శారదమ్మగారు కనిపించారు వాహినికి.

ఆవిడని చూడగానే వాహిని పెదవులపై చిరునవ్వు విరిసింది. 'వచ్చారా!' అన్నట్లు కళ్ళతోనే పలకరించింది.

శారదమ్మగారు దగ్గరగా వచ్చి తలమీద చెయ్యివేసి నిమిరారు. "తేలిగ్గా వుందామ్మా వాహినీ!" అంటూ పలకరించారు.

ఇందాకటిలాగే తల వూపి వూరుకుంది వాహిని.

"నెమ్మదిగా లేమ్మా వాహినీ! మంచం మీద పడుక్కుందువుగాని."

శారదమ్మగారు, వర్దనమ్మ చెరో రెక్కా పట్టుకుని వాహినిని నెమ్మదిగా నడిపించుకు వెళ్ళి గదిలో మంచం మీద పడుకోబెట్టారు.

దుప్పటి కప్పింది వర్దనమ్మ.

"ఏమ్మా....వాహినీ యిప్పుడు కాస్త తేలిగ్గా వుందా?" అంటూ ఆర్ద్రంగా వాహిని తల మీద నిమిరారు శారదమ్మగారు.

తల ఎత్తి చూసి "ఇప్పుడు కాస్త బాగానే వుందండీ....!" అంది వాహిని మెల్లగా.

ఆవిడ కళ్ళు దయగా చూస్తున్నాయి.

"కాస్సేపు పడుక్కుని నిద్రపోమ్మా.... దేనికైనా మనస్సు ప్రశాంతగా వుండటం ముఖ్యం..." అంటూ వాహిని తల మరోసారి నిమిరి తను తెచ్చిన జిలాబి, మిఠాయి, ద్రాక్షపళ్ళు, రవికల గుడ్డ వున్న పళ్ళెం చేత్తో పట్టుకుని, "ఒసారి నీ చేత్తో పళ్ళెం చివర పట్టుకోమ్మా వాహినీ!" అన్నారావిడ.

"ఇప్పుడివన్నీ ఎందుకండీ!" అంటూ బిడియ పడింది వాహిని.

"ఇప్పుడు కాక యింకెప్పుడు? ఒక్కసారి నీ చేత్తో పళ్ళెం ముట్టుకో."

వాహిని ఆవిడ చెప్పినట్లే చేసింది.

ఆవిడ పళ్ళెం పట్టుకువెళ్ళి వర్థనమ్మకిచ్చింది.

"ఏమిటండీ వదినగారూ! ఏకంగా యిన్ని తెచ్చారు?"

"ఏమున్నాయమ్మా — ఎక్కువ? ఏదో లాంఛనం. అంతే."

వర్థనమ్మ శారదమ్మగారికి వాయినం యిచ్చి ఆవిడని గుమ్మందాకా సాగనంపి వచ్చింది.

[సశేషం]

# పుట్టిన రోజులు

ఈ నెల 1–15 తేదీల మధ్య పుట్టిన రోజులు జరిగే బాలల ఫోటోల్లో– ఆరోగ్యమైన వారివి. ఐదు ఫోటోలు ఎన్నిక చేసి ఇక్కడ ప్రచురిస్తున్నాము. వీరిలో అందరి కంటె ఆరోగ్యంగా కనిపిస్తున్న

ఎమ్. భగవాన్ ను

'ఈ పక్షపు–శిశువు'గా నిర్ణయించి, పుట్టిన రోజు కానుకను పంపుతున్నాము.



ఎమ్. భగవాన్ (విశాఖపట్నం) పుట్టిన తేదీ: 3-11-76 తల్లి పేరు: ఎమ్. ఉమా వేణుగోపాల్





కె. అజయ్ (నల్గొండ) పుట్టిన తేదీ: 14-11-76 తల్లి పేరు: వినోదినీ మురళీధరరావు





ఐ. వినుత (పాలకొండ) పుట్టిన తేదీ: 5-11-75 తల్లి పేరు: ఐ. గిరిజాసుందరి బి. ఎ.



యస్. కె. బ్రిజేష్ (హైద్రాబాదు) పుట్టిన తేదీ: 7-11-75 తల్లి పేరు: యస్. శారద



బి. రూప. (పట్టాభిరాం, మద్రాసు) పుట్టిన తేదీ: 2-11-76 తల్లి పేరు: బి. శ్రీకాంతమ్మ



## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు – 29' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు నవంబర్ నెలాఖరులోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు స్పష్టంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1978 జనవరి 1వ తేదీ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారాలు—అడ్డం

1. మధ్యలో అక్షరం వుంటే సుగమమయ్యేది—లేకపోయినా అల్లుకుపోగలదు
4. కపోలము
6. ఫలకము
7. రాలేని రాజు
9. (న)డవడి
10. మూడుకు తక్కువ; ఒకటికి ఎక్కువ
12. ఈ బట్ట ధరించి వంట చెయ్యాలన్నారుట పూర్వీకులు.
13. దేవుడు ఇస్తే అది, ఇదవుతుంది. అయినా కొంతే ఇచ్చాడు.
15. ఆద్యంలో లోపం జరిగిన అలయిక
17. కొంకతగ్గ 'వైవాహికముల' ముందు - ఎవరు?
18. నాట్యానికి సంబంధించిన మాట
19. ఒట్టు!
20. ఎద
21. వాన

### ఆధారాలు—నిలువు

1. మొదట్లోనే 'కాలిపోయిన' కర్ర.
2. శిరము, కర్ర కలిస్తే ప్రక్కమీదికి అవసరమవుతుంది.
3. కార్యసాధనకు అవసరమైనది
5. కన్నె
8. ఏలిక
10. కుంభవృష్టి
11. సెలయేటి శబ్దం
13. బ్రహ్మ? ఒక బ్రహ్మ?
14. కనువాడా? వినువాడా?
16. మంచి భార్యే!
19. వేయదగ్గ ఒక తాళము; తీయదగ్గది కాదు.

# వనిత మాటల కొలువు-29

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | ■ | ■ | 3 | ■ | 4 | 5 |
| 6 | | | ■ | శ్రీ | ■ | ■ | |
| ■ | | ■ | 7 | ■ | 8 | ■ | |
| ■ | 9 | | ■ | 10 | | ■ | ■ |
| 11 | ■ | ■ | 12 | | ■ | 13 | 14 |
| 15 | 16 | | ■ | 17 | | | |
| 18 | | ■ | 19 | | ■ | | ■ |
| ల | ■ | 20 | | ■ | 21 | తి | |

పేరు.................................................

చిరునామా.................................................

.................................................

.................................................




# కావాలి అనుకుంటే
# కావలసినంత వినోదం!
## రేడియో సిలోన్

రేడియో కార్యక్రమాల్లో ఇంటిల్లిపాదికి ఆనందం కలిగించాలంటే-'రేడియో సిలోన్' కు మించినది లేదు! ఇంగ్లీషు, హిందీ, తెలుగు, తమిళం, కన్నడ, మలయాళ భాషల కార్యక్రమాల్లో స్పష్టత, స్వచ్ఛత కావాలంటే 'రేడియో సిలోన్' వినవలసిందే! రేడియోలో అన్ని స్టేషన్లూ త్రిప్పి చూడండి - ఏ స్టేషన్ విస్పష్టంగా విన వస్తుందో అది, కచ్చితంగా 'రేడియో సిలోన్'.

ఇంగ్లీషు—ప్రతిదినం

| | |
|---|---|
| 0600 to 1000 hrs | 15525 KHZ (19 మీ) |
| | 9720 KHZ (31 మీ) |
| | 6075 KHZ (49 మీ) |
| 1800 to 2300 hrs | 15425 KHZ (19 మీ) |
| | 9720 KHZ (31 మీ) |
| | 7190 KHZ (41 మీ) |

హిందీ—సోమవారం నుండి శనివారం వరకు

| | |
|---|---|
| 0600 to 1000 hrs | 11800 KHZ (25 మీ) |
| 1200 to 1400 hrs | 7190 KHZ (41 మీ) |
| 1900 to 2300 hrs | 11800 KHZ (25 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

హిందీ—ఆదివారాలు మాత్రం

| | |
|---|---|
| 0600 to 1400 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |
| 1900 to 2300 hrs | 11800 KHZ (25 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

తమిళం—ప్రతిదినం

| | |
|---|---|
| 1630 to 1900 hrs | 11800 KHZ (25 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

మలయాళం—ప్రతిదినం

| | |
|---|---|
| 1530 to 1630 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

తెలుగు—ప్రతిదినం

| | |
|---|---|
| 1430 to 1530 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |

కన్నడం—ప్రతిదినం

| | |
|---|---|
| 1400 to 1430 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |

విదేశాలలో వ్యాపారాభివృద్ధి కోరుకునే ప్రకటన దారులు ఈ విలాసాన్ని సంప్రదించండి.

రేడియో అడ్వర్టైసింగ్ సర్వీసెస్
సిసిల్ కోర్ట్
లాండ్స్ డౌనీ రోడ్
బొంబాయి 400039
టెలిఫోన్ : 213046/7
గ్రామ్స్ : RADONDA

30, ఫిఫ్త్ ట్రస్ట్ క్రాస్ స్ట్రీట్
మందవల్లిపాక్కం
మదరాసు 600028
టెలిఫోన్ : 73736
గ్రామ్స్ : RADONDA

# పర్వత శిఖరారోహణ చేసిన ఎన్.సి.సి.యువతులు

"వనితలు తలచుకుంటే ఉన్నత శిఖరాలు అధిరోహించగలరు" అని చాలామంది అభిప్రాయ పడుతూ ఉంటారు. కొంతమంది వనితలు మాత్రం ఆ అభిప్రాయాన్ని అక్షరాలా నిజం చెయ్యడానికి నిజంగానే ఉన్నత శిఖరాలు అధిరోహిస్తూ ఉంటారు. అలా ఇటీవల ఒక ఉన్నత శిఖరం అధిరోహించి కొత్త చరిత్ర సృష్టించారు నేషనల్ కేడెట్ కోర్‌స (ఎన్. సి. సి)కు చెందిన ఇద్దరు యువతులు.

ఢిల్లీకి చెందిన ఎన్. సి. సి. సెకండ్ ఆఫీసర్ కుమారి భారతీ బెనర్జీ, ఇంఫాల్‌కు చెందిన సార్జంట్ కుమారి ఉమేశ్వరీదేవి అనే ఆ ఇద్దరు యువతులూ సెప్టెంబర్ 28న గర్‌వాల్ హిమాలయా పర్వతాలలో 6,592 మీటర్ల ఎత్తులో ఉన్న రతబన్ శిఖరం అధిరోహించారు. భారతదేశం మొత్తం మీద ఇలా పర్వతారోహణ చేసిన తొలి ఎన్. సి. సి. యువతులు వీరే కావడం విశేషం।

మేజర్ (శ్రీమతి) శశికాంత నాయకత్వంలో బయలుదేరిన ఎన్. సి. సి యువతుల బృందంలో శిఖరారోహణ చేసిన యిద్దరే కాక – ఇంఫాల్‌కు చెందిన సార్జంట్ కుమారి జామినిదేవి, బొంబాయికి చెందిన సీనియర్ అండర్ ఆఫీసర్ కుమారి కారీన్ డిసౌజా, డెహ్రాడూన్‌కు చెందిన అండర్ ఆఫీసర్ కుమారి సంతోష్ రావత్, ఢిల్లీకి చెందిన అండర్ ఆఫీసర్ కుమారి స్వీటీ బుటాలియా, మైసూరుకు చెందిన సెకండ్ లెఫ్టినెంట్ కె. సి. కావేరమ్మ మొదలైనవారు కూడా ఉన్నారు. ఈ బృందానికి లెఫ్టినెంట్ కర్నల్ ఎం. ఎం. శర్మ 'ఆఫీసర్–ఇన్–ఛార్జ్'గా పని చేశారు. కుమారి భారతీ బెనర్జీ ఈ బృందానికి ఉపనాయకత్వం వహించారు.

విజయవంతంగా పర్వతారోహణ చేసిన ఈ బృందంవారు కొత్తఢిల్లీకి వచ్చి రక్షణ మంత్రి శ్రీ జగజీవన్‌రామ్‌ను కలుసుకుని ఆయన అభినందనలు అందుకున్నారు. తర్వాత వారు రక్షణ



కుమారి భారతీ బెనర్జీ



కుమారి కామేశ్వరీదేవి

శాఖ స్టేట్ మంత్రి శ్రీ షేర్‌సింగ్‌ను, రక్షణశాఖ కార్యదర్శి శ్రీ గ్యాన్‌ప్రకాష్, ఎన్. సి. సి. డైరక్టర్ జనరల్ అయిన మేజర్ జనరల్ శ్రీ హెచ్. కె. బక్షిని కూడా కలుసుకుని, వారి అభినందలు స్వీకరించారు.

ఆ తర్వాత జరిగిన పత్రికా విలేకరుల సమావేశంలో భారతీ బెనర్జీ, ఉమేశ్వరిదేవి తమ శిఖరారోహణ గురించి వివరించారు.

ఢిల్లీలో సెప్టెంబర్ 10వ తేదీనాడు బయలుదేరిన ఈ పర్వతారోహక బృందంవారు సెప్టెంబర్ 12న జోషీమట్ చేరుకున్నారు. జోషీమట్ చేరుకునే ముందు వారు పువ్వులలోయ (వాలీ ఆఫ్ ఫ్లవర్స్)లో ఉండి, అక్కడి శీతలపరిస్థితికి అలవాటుపడ్డారు.

సెప్టెంబర్ 12న వారు 5,000 మీటర్ల ఎత్తున మకాం (బేస్ కాంప్) ఏర్పాటు చేసుకున్నారు. సెప్టెంబర్ 17న వారు తమ తొలి మకామూ, సెప్టెంబర్ 20న 5,500 మీటర్ల ఎత్తున రెండవ మకామూ ఏర్పాటు చేసుకున్నారు.

"మేము అధిరోహించిన రతబన్ శిఖరం హిమాలయ పర్వత శిఖరాల అంత ఎత్తయినది కాదు. కాని చాలా శ్రమపడితేకాని చేరుకోరానిది," అని చెప్పింది కుమారి భారతీ బెనర్జీ. ఇదివరలో రెండు విదేశీయ బృందాలు ఈ శిఖరం ఎక్కే ప్రయత్నాలు చేసినా, వాటిలో ఒక బృందం మాత్రమే విజయం సాధించగలిగింది. రతబన్ శిఖరం గర్‌వాల్ హిమాలయాలలో జోషి మఠానికి ఈశాన్యాన 20 కిలోమీటర్ల దూరాన ఉన్నది.

శిఖరాన్ని అందుకోవడానికి పూనుకున్న యిద్దరినీ వారి ఆరోగ్యం దృష్ట్యా ఎన్నిక చేశారు.

"మేము సెప్టెంబర్ 28నాడు తెల్లవారుజామున ఐదున్నరగంటలకు శిఖరారోహణకు బయలుదేరాము. అప్పుడు వాతావరణం చాలా బాగుంది. మంచు నిండిన ఆ మార్గం వెంబడి నెమ్మదిగా సాగిపోయాము. మధ్య మధ్య మంచు పొర కింద ఉండే గోతులు జాగ్రత్తగా దాటుకుని వెళ్ళాము. పర్వతం కింది భాగానికి చేరుకుని చూస్తే, మీదికి వెళ్ళడం చాలా కష్టం అనిపించింది"

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026

అన్నారు కుమారి భారతి.

ఈ యువతులకు శిఖరారోహణలో ముగ్గురు షెర్పాలు సాయపడ్డారు. సర్దార్ నవాంగ్ తెర్షింగ్, పాసాంగ్, ప్రుదా అనే ఆ ముగ్గురు షెర్పాలు కొన్నాళ్ళ ముందు నుంచే శిఖరం చేరుకునే మార్గంలో తాళ్ళు కట్టడం వంటి ఏర్పాట్లు పూర్తి చేశారు.

మంచు తుఫానుల ద్వారా ఇబ్బందులు కలగకుండా ఉండడం కోసం వాళ్ళు రాళ్ళతో నిండిన మార్గాన్ని ఎన్నుకోవడంవల్ల ఆరోహణ బాగా కష్టమైంది. మధ్యాహ్నం 1-45 గంటల దాకా అవాంతరాలను తొలగించుకోవడంతోనే సరిపోయింది. చివరికి తెచ్చుకున్న తాళ్ళు చాలక ముందుకు అతి కష్టం మీద వెళ్ళాల్సి వచ్చిందట।

మొత్తం మీద భారతి, ఉమేశ్వరీదేవి షెర్పాలతో కలిసి సెప్టెంబర్ 28నాడు మధ్యాహ్నం 3.35కు శిఖరం చేరుకున్నారు. అక్కడ వాళ్ళు 25 నిమిషాలపాటు గడిపారు. భారత జాతీయ పతాకం, ఎన్. సి. సి. చిహ్నం, తక్కిన జ్ఞాపక చిహ్నాలు అక్కడ వదిలిపెట్టి వాటితోపాటు పర్వతాన్ని ఉద్దేశించి వ్రాసిన ఒక లేఖను కూడా ఉంచారు. ఆ ఉత్తరంలో తాము మళ్ళీ మరొక రోజున ఆ శిఖరం చేరుకోగలమని వారు పేర్కొన్నారు।

"శిఖరం నుంచి కిందికి దిగి మకాం చేరుకోవడం—శిఖరం చేరుకోవడానికి చేసిన ప్రయాణం కన్నా బాగా ఇబ్బంది పెట్టేసింది" అన్నారు భారతి. విపరీతంగా మంచు కురవడంతో, వచ్చిన దారి వెంబడి కట్టుకున్న తాళ్ళు కనబడలేదట. "అతి కష్టం మీద, రాత్రి 7-30కి తాళ్ళు కనిపించాయి. ఇక అక్కడ విశ్రాంతి తీసుకుందామని మొదట అనుకున్నా ఆ ప్రయత్నం విరమించి కిందికి దిగడం ప్రారంభించాము" అన్నారు భారతి. అలా మూడు గంటలు ప్రయాణం చేసి ఒక పెద్ద బండను చేరుకుని అక్కడ రెండు గంటలపాటు విశ్రాంతి తీసుకుని మళ్ళీ బయలుదేరారు.

"వెన్నెల ఉన్నా మేము రెండవ మకాం చేరుకోవడం చాలా కష్టమైపోయింది. నెమ్మదిగా సాగి ఉదయం 6-15కు మకాం చేరుకున్నాము" అని చెప్పారు భారతి. అప్పటికి వారు మకాం వదిలి వెళ్ళి 24 గంటలకు పైగా అయింది।

"షెర్పాలు ఉన్నంత మాత్రాన ఇది స్త్రీల ప్రయత్నం కాదని అనుకోనక్కరలేదు. ఆ మాటకు వస్తే పురుషులు పర్వతారోహణ చెయ్యాలన్నా షెర్పాల సాయం తప్పనిసరి అయినదే కదా!" అని తమ కృషి సాధారణమైన విషయం కాదని పేర్కొన్నారు భారతి.

"మా ఈ ప్రయత్నం చాలా కష్టమైనది. మాకు అడుగడుగునా ఎదురైన ఆటంకాలు మా పట్టుదలను మరింత ఎక్కువ చేశాయి. ఆ పట్టుదలే మమ్మల్ని ఆ శిఖరం చేర్చింది" అన్నారు ఉమేశ్వరీదేవి.

ఈ పర్వతారోహణ ప్రయత్నాల గురించి చెబుతూ మేజర్ జనరల్ శ్రీ బక్షి దాదాపు 60 మంది యువతులకు పర్వతారోహణలో శిక్షణ యిచ్చామనీ, త్వరలో మరి కొన్ని బృందాలు వివిధ శిఖరాలను అందుకునే ప్రయత్నాలు చేస్తారనీ తెలియజేశారు.

"త్వరలో నందాదేవి శిఖరం, ఎవరెస్ట్ శిఖరం కూడా అధిరోహించాలని నేను కోరుకుంటున్నాను" అని భారతీ బెనర్జీ వెలిబుచ్చిన అభిప్రాయం—వనితలందరికీ కొండెక్కినంత సంతోషం కలిగించగలదు।

# పార్లే క్రాక్‌జాక్ నాట్యం

"సరిగా...గా..గా ఉప్పుప్పగా"

"తోం తరిగిణతోం తియ్య తియ్యగా"

Krackjack

విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటాయి...
జాగ్రత్త!

తియ్యగా ఉప్పగా ఆ రుచి ఎంతో హోయ్ హోయ్
క్రాక్‌జాక్‌తో మజాగా కొట్టండి ఇకపై జై జై

everest/929/PP-tl







వరల్డ్ సెలక్షన్ బహుమతి విజేత